


సంపుటం : ౯.  వృష, జ్యేష్ఠము : జూన్, 1941.  సంచిక : ౮.

# 'పొట్టివాడు గట్టివా'డనటం వట్టిమాట కాదు!

అవతల పౌరాణిక గాథలూ, ఇవతల చారిత్రిక ఘట్టాలూ, మరి ఎన్నో ప్రత్యక్ష నిదర్శనాలుకూడ ఈ లోకోక్తిని ధృవపరుస్తున్నాయి.

పొట్టి మనుషులలోనే కాదు,
చిన్న దేశాలకూడా గట్టితనమున్నది

పొట్టివాడు గట్టివాడనే లోకోక్తివుంది మనలో.

దేవతల నిందరను జయించి పరిపాలిస్తున్న బలిచక్రవర్తిని వామనుడు పాతాళమునకు అణగద్రొక్కిన గాథ మనకందరకు విశదమే వామనుడు పొట్టివాడగుటవలననే పుట్టైన బుద్ధులతో బలిని పాతాళమునకు పంపాడు. మన పురాణాల సంగతి అలావుంచండి. చరిత్ర పరిశీలించినా పొట్టివాడే గొప్పవాడవుతున్నాడు.

ఒడ్డుపొడుగులు చాలవరకు వంటిమీదనే ఆధారపడివుంటవి.

తాత ముత్తాతలమీద. తల్లిదండ్రులమీద, పుట్టిన దేశ శీతోష్ణస్థితులమీద అలవాటులమీద కూడ ఆధారపడి వుంటవి మానవుని ఒడ్డుపొడుగులు.

పొడుగుపాటి దంపతులకు పొడుగుపాటి పిల్లవాడు పుట్టుట సహజమే కాని సర్వత్రా అలాంటిది జరగదు. బలిష్ఠమైన తల్లిదండ్రులకు కీచురాయిలాంటి వాడు పుట్టవచ్చు.

ఈమధ్యను ఏవేవో సాధకాలు వచ్చాయి : మూడురాత్రిళ్ళలో వేలు కణుపుడుగాణ్ణి తాటిచెట్టు తలతన్నేవానిగా చేసేస్తామని.

పొడుగుపెళ్లాలు కల పొట్టివాళ్ళు చాలామంది, ఎదగాలన్న తంటాలు పడ్డాగు—కనపడ్డ మందల్లా పట్టుకుని.

పొట్టివాళ్ళే గొప్పవాళ్ళన్నమాట వుంటే ఆ పని చేసివుండరనుకుంటాను.

అంతా ఒకే తరహాలో వుండటం ఎట్లా కుదురుతుంది.

అయితే పొడుగు పొట్టి—వీటి పరిణామా లెట్లా?

ఆరు అడుగులు పైబడితే అ జానబాహు. దానికి ఏమాత్రం

తక్కువ ఉన్నా పొట్టివాడిలోనే జను.

మొత్తంమీద అయిదు అడుగుల ఆప్రాంతంలో ఉన్నవాళ్లు పొట్టివారని పిలువబడతారు.

పొట్టివాడు అంగుళాలలోవున్న లోపాన్ని మేధాశక్తిచే కూడదీసుకుంటాడు.

ఏక్లాసులోనేగానరే పొట్టివాళ్ళకు ముందర సీటుయిస్తారు విద్యాలయాల్లో. పొడుగాటివాళ్లు వెనక కూచుంటారు అతడు తన దేహసౌష్టవం చూచుకునే తృప్తిపడతాడు. పొట్టివాడు శ్రద్ధగా చదివి ఫస్టుమార్కులు సంపాదిస్తాడు.

విద్యార్థి దశలో వున్న చురుకే పెద్ద పెరిగాకకూడా చూపిస్తాడు పొట్టివాడు.

అందుకనే రాజకీయరంగంలో కాని వర్తక వ్యాపారంలో కాని పొట్టివారే మిక్కుటంగా కనుపిస్తారు. ఈ విషయాన్నిగూర్చి డాక్టర్ జంగు అనేఆయన పరిశోధించి కనిపెట్టిం దేమిటంటే: పొట్టివారికి ఆశ అధికమని. దానివల్ల సర్వకాల సర్వావస్థలయందు ఆశయసిద్ధికై పాటుపడతాడని తేల్చాడు.

ఆజానబాహులకి ఉన్నదానితో తృప్తికాగా కొండచలవలాగ కూలబడి వుంటాడు.

కాని పొట్టివానికీ పొడవువానికి కిట్టదు.

పొట్టివారు పొడుగువారిని లోపు చేసుకున్న ఘట్టాలు చాలా వున్నాయి. కొన్ని ఉదాహరణలు:

నేటి ఫ్రాన్సు క్విసిలింగులావల్ మహాశయుడు తనకన్నా పొడుగ్గా వున్న రాజకీయవేత్త. ఫ్లైరిప్లాన్ డిన్‌ను వశపరచుకొన్నాడు, బుద్ధిబలం దేహబలంకన్నా ఘనమైంది.

నేటి నియంతలు హిట్లరు ముసోలిని, ఫ్రాంకోకూడా పొట్టివారే ఈమధ్యను స్విజర్లాండు అధ్యక్షులుగావున్నవారు మిగ్గునా? పొట్టి బుడంకాయలే. అంతేకాదు, వ్యక్తి పొట్టిగా వుండడమే కాదు, చిన్న చిన్న జాతులు విశాలమైన దేశాలను బానిసలుగా చేసుకోవడంకూడా చూస్తున్నాం.

తూర్పున జపాను పశ్చిమమున యింగ్లాండు ఇందుకు సాక్షీభూతాలు. లోడితెడు దేశాలు ఖండ ఖండాలనే పాలిస్తున్నాయి.

చరిత్రలో పేరు ప్రఖ్యాతులు వడసిన ప్రముఖులు చాలమంది పొట్టివారే.

జూలియస్ సీజర్ 5 అడుగులు రెండంగుళములు ప్రపంచాన్ని అగ్గలాడించిన నెపోలియన్ బోనాపార్టు 5 అడుగుల ఒక అంగుళం పొడవు.

అలగ్జాండరు 5 అడుగుల 3 అంగుళాల మనిషి.

నేడు ప్రపంచాన్ని అంతను ఆకర్షిస్తున్న సోషలిజాన్ని కార్యరూపంలోకి తీసుకొనివచ్చిన లెనిన్ అదరికన్నా పొట్టివాడు- నాలుగు అడుగుల పదకొండు అంగాళాల మనిషి.

చైనా వీరుడు సన్‌యట్‌సేన్ 5 అడుగుల మనిషి సౌత్ ఆఫ్రికాకు స్వేచ్ఛను సంపాదించిన జనరల్ బోథా 5 అడుగుల ఒకంగుళం వాడే.

మనగాంధి మహాత్ముడుకూడా పొట్టివారిలోనే జను.

హాలీవుడ్ల సినీమాప్రపంచకంలో పేరుమోసిన జాన్ బెనెట్, సోంజాహెని వివియన్ లీహ, మొదలైన తారలు పొట్టివారే.

అంటే పొట్టివారే గట్టివారని తెలుస్తోంది.

పొట్టివాడు గట్టివాడంటున్నారని పొడుగాటివాళ్లు మాత్రం కాళ్లువేళ్లు విరగ్గొట్టుకొని కూచోకండేం! పొట్టిగా కనపడాలని. బహుపరాక్—

# మల్లె మొగ్గలు

[చిన్న కథ]

"ఈ పల్లెటూరి పిల్లలకు ప్రేమ అంటే పెండ్లాడి పిల్లల్ని కనటమని భావం. శృంగారం, రసికత వాళ్ళ కర్థంకాదు— అనుకుని రామిరెడ్డి తనలో నవ్వుకు న్నాడు... అరుణ సంతోషిస్తున్నదంటే తనపట్ల ఆమె ఎంత స్నిగ్ధభావంతో వున్నదో తెలుస్తున్నది. ఆమె హృదయం తనహృదయానికెంతో సన్నిహితంగా ఉన్నది. అటువంటి ప్రేమమయి ఒక్కసారయినా తనకేసి క్రీగంటి చూపుగాని, దరహాసంగాని ప్రసరించ లేదేం?"

రచయిత:

## పురాణం కుమారరాఘవశాస్త్రి, బి.యే.

వయసు వచ్చినప్పటినించీ, పెద్ద పెద్ద పట్నాల్లో ఉంటూ, గోపికల మధ్య శ్రీకృష్ణుడులాగ వ్యవహారిస్తూవచ్చిన రామిరెడ్డికి—పితృమరణానంతరం తప్పనిసరిగా స్వంత వ్యవహారాలు చూచుకోవలసివచ్చి స్వగ్రామం వచ్చాక ఏమీ తోచకండా ఉంది, పాపం. క్లబ్బులకూ, సినిమాలకూ, టీపార్టీలకూ, నృత్యశాలలకూ, పట్నవాసపు వివిధ వినోదాలకూ మొగం వాచిపోయాడు ఈ రెండు మూడు నెలలనించీ.

ఇన్నాళ్ళుగా తాను పల్లెటూళ్ళో ఎన్నడూ ఉండలేదు. ఈసారి మాత్రం చప్పున వెళ్ళిపోడానికి వీల్లేకండా వచ్చింది. తన ఆర్థిక పరిస్థితి తాననుకున్నంత ఘనమైనది కాదనీ, బోలెడంతమంది అప్పులవాళ్ళకు తాను సమాధానం చెప్పవలసి ఉందనీ—ఈ రెండు ముఖ్యవిషయాలు తండ్రి చనిపోయిన తర్వాత గుర్తించగలిగాడు. తండ్రిగారి సహజౌదార్యం, దానపరత్వం, బంధుప్రీతి, బీదలయెడల జాలి, పండితులంటే గౌరవం—ఈ మొదలైన గుణాల్ని అందరూ పొగడుతూంటే—లేనిపోని పేరుకోసం ధనమంతా వెదజల్లి ఆయన తన్ను బికారిని చేసిపోయాడని రామిరెడ్డి పళ్లు కొరుక్కుండేవాడు. తాను పట్నాల్లో ఉంటూ భోగవిలాసాలకు ధనం నీళ్లులాగ ఖర్చుచేస్తూన్నప్పుడు పుత్రప్రేమచేత వందలకు వందలు పంపిస్తూ వచ్చిన ఆయనపట్ల తన కప్పుడున్న కృతజ్ఞత ఇప్పుడు అణుమాత్రమూ మిగిలిలేదు. అప్పులవాళ్ళ బాధలు వొదిలించుకుంటే తప్ప పల్లెటూరిపీడ వొదిలేట్టు లేదు. ఈ వ్యవహారపు చిక్కుల మూలాన్ని కలిగిన మనోవికలతచేత రాత్రిళ్లు చేయవలసి వస్తోన్న జాగరణలు స్త్రీసహవాసము లభిస్తే కొంతవరకు సహ్యము లౌతాయేమో అనిపించిం దతనికి.

అరుణ—తన వ్యవహారాల్ని పరిష్కరించటంలో చాలవరకు సహాయభూతుడౌతూన్న పెద్దకాపు కూతురు—తనపట్ల ఎటువంటిభావంతో ఉన్నదో తాను తెలుసుకోలేకండా ఉండటం రామిరెడ్డికే విచిత్రంగా ఉంది. తాను తిరిగిన నాగరిక ప్రపంచంలో స్త్రీలంతా తనకోసం పడిచచ్చారు. క్లబ్బుల్లో తనతో కలసి డాన్సుచేయటానికి అందగత్తెలంతా పంతాలువేసుకు వచ్చారు. ముసలిఉద్యోగస్థుల పడుచుభార్యలెందరో తన్ను కోరి రహస్యస్థలాలకు పిలిపించుకున్నారు. అటువంటప్పుడు ఈఅరుణ ఇంత ముభావంగా ఉండటం తన అందానికీ, రసికతకూ ధిక్కారం, ఇది తాను సహించవలసిందేనా?

పెద్దకాపుగారింటో తాను సొంతయింటోలాగే తిరిగేవాడు. కాని చొరవ, చలాకీ, మాటల చాతుర్యం—ఈమొదలైన గుణాలు మచ్చుకేనా కనిపించని అరుణతో మాటలు కలపటానికే తనకు చాతకాలేదు. ఎప్పుడూ ఒక రకమైన మౌనముద్రతోఉండే ఆమెను ఏమి పలుకరిస్తే ఏమి తప్పొస్తుందో అని భయపడవలసివచ్చేది. అందుచేత మాటలతో కాకండా చిలిపినవ్వులతోనూ, వలపు చూపులతోనూ ఆమెకు చక్కలిగింత పెట్టాలని చూచాడు. కాని శృంగారరసద్యోతకమైన కవళిక ప్రదర్శించి నవ్వుడల్లా తన్నామె పేడపురుగును లాగ చూచింది. ఆమెలో అసలు స్త్రీత్వం లేదేమో నన్న అనుమానం కలిగింది తనకు. సృష్టికర్త ఆవిగ్రహాన్ని నిర్మించి అందులో హృదయం ఇముడ్చడం మరచిపోయాడేమో ననుకోవలసి వచ్చింది. ఇటువంటి శుద్ధ- మొద్దు- స్వరూపం తన నాగరికప్రపంచంలో ఎక్కడాచూచి యెరుగడు.

వాంఛనీయమైన వస్తువు కాదనుకుంటూ కూడా తన మనస్సు ఆమెకేసే పరుగెత్తుతూండడ మెందుకో అతనికే అర్థమవలేదు. చివర కొకసారి ఒంటరిపాటు చిక్కించుకుని పలుకరించికూడా చూచాడు. స్వాభిమాన మంతా చంపుకుని 'అరుణా! నేను నిన్ను ప్రేమిస్తున్నా'నని బట్టబయలుగా చెప్పినప్పు డామె ఏమంది? 'ఆ సంగతి మా నాన్నగారితో చెప్పండి' అని అచంచలమై, చదువుకుంటోన్న పుస్తకంమీదినించి దృష్టుల్ని తనకేసి మరల్చకండానే, నిర్లక్ష్యంగా జవాబుచెప్పింది. లాగి లెంపకాయ ఇచ్చుకుందా మనిపించిం దతనికి. కాని—ఆమె అంతమాత్రమైనా స్థిమితంగా జవాబిస్తుందని మొదట తా ననుకోలేదు. ప్రేమ ప్రసంగం ఎత్తితే పూర్తిగా బెదరిపోయి వికటతాండవం చేస్తుందేమోనని మొదట తాను భయపడ్డాడు. దైవవశాత్తు అలా జరగనందుకు ఒక పెద్దగండం తప్పినట్టు సంతోషించి—మేనమామగారి వూళ్ళో థర్డు ఫారంవరకు చదివినపిల్ల కావటం చేత అంత మరీ'బ్రూటు'కా దనుకుని—'మీనాన్నను కాదుగా నేను ప్రేమించేది' అన్నాడు. ఆమె అందుకు జవాబేమీ చెప్పలేదు. బిచ్చమడిగి లేదనిపించుకున్న అభిమానివలె సగం చచ్చిపోయినాడు తాను.

ఈ అరుణకంటె వాళ్ళింటో పని చేసే గొల్లది చాల నయ మనిపించింది రామిరెడ్డికి. చలాకీగా నవ్వుతూ మాట్లాడుతుం దది. దాన్ని తనయింటోకూడా పనికి కుదుర్చుకోవటం రామిరెడ్డి కంత కష్ట మనిపించలేదు. తండ్రిగారి అంత్యక్రియలు ముగియగానే వచ్చిన బంధువులంతా వెళ్ళిపోయారు, ఇంటో తానొక్కడే అవటం చాల వీలుగానే ఉంది. ఆ పనిమనిషికూడా హుషారుగా—కాయకష్టం చేసేది కావున కండలు తేరిన అవయవసౌష్టవంతో—పాతికేళ్ళు దాటని వయసులో ఉంటుంది.

దానిమీద రామిరెడ్డి వాంఛ పుట్టించుకున్నాడు. కాని దాన్ని రంగంలోకి దించటం సులభసాధ్యంగా అయే పనిలాలేదు. తా నెరిగిన ప్రపంచానికీ ఇప్పుడిప్పుడు తెలుసుకుంటోన్న ప్రపంచానికీ చాల వ్యత్యాసం ఉంది. ఈ అనాగరికపు దాన్ని ప్రేమించినందు కొక లెంపకాయ ప్రతిఫలంగా ముట్టవచ్చు. అంతటితో ముగియక, తన ప్రణయకథ ఒక గంటసేపటిలో ఊరంతా పాకిపోయి, ఆ పల్లెటూరివాళ్ళ దృష్టిలో తానొక పెద్ద అవినీతిపరుడు—మహాపరాధిఅయి, మళ్ళీ అక్కడ తలెత్తుకు తిరగటానికి వీల్లేని పరిస్థితులు సంభవించవచ్చు.

అట్లని ఊరుకోటానికీ మనస్సొప్పటం లేదు. ''ఛీ, 'రొమాన్సు' లేకండ జీవచ్ఛవంలాగ ఉంటావా, రామిరెడ్డీ!'' అని దెప్పి పొడిచింది అంతరాత్మ. ఒకనాటి సాయంత్రం ఆగొల్లది హాల్లో సందెకసువు చిమ్ముతోండగా అతను అద్దం ముందు క్రాపు దువ్వుకుంటూ, ఎలా ప్రసంగిస్తే లౌకికంగా ఉంటుందా అని కొంతసేపు ఆలోచించినమీదట అన్నాడు: 'ఈలంకంత యింటో రాత్రిళ్లు నా కొక్కడికీ పడుకోడానికి చాల యిదిగా ఉంటోంది గొల్లా!' అని—

ఆ మాటల్లో 'నీవుకూడా నాకు తోడుగా వచ్చి పడుకోరాదూ' అన్న అంతర్భావం ఆ పడుచు గ్రహించి—శరీరం గగుర్పొడిచి, బుగ్గ లెఱ్ఱబడి, వక్షం వ్యాకోచించి, తన కేసి క్రీకంట చూడాలని అతని యాశ.

యజమాని నిజగాంభీర్యాన్ని దాచి ప్రసన్నుడుగా ఉన్నప్పుడు నౌకర్లు సాధారణంగా తీసుకునేంత చనువుమాత్రమే ఆపనిమనిషికూడా అనుభవించి, నిర్వికారమైన చిరునవ్వు ప్రదర్శిస్తూ 'ఛానండి, బాబయ్యగారూ! దబ్బున అరుణమ్మగార్ని పెండ్లి చేశేసుకోరాదంటండీ!' అని, అంతటితో ఆగక, సహజంగా అధనప్రసంగియైన కారణంచేత అరుణ అతన్నే ఎక్కువగా ప్రేమిస్తోందనీ, కొంతకాలం కిందట ఆమెకు పెద్దసంబంధంఒకటి వచ్చినప్పుడు తల్లిదండ్రులొప్పుకున్నా ఆమె నిరాకరించిందనీ — మొదలైన విషయాలన్నీ ఏకరువు పెట్టింది. ఆమె తండ్రిగారితో మాట్లాడి పెళ్ళి స్థిరపరచుకోండని కూడా సలహా యిచ్చింది.

ఈ మాటలతో గొల్లదాని మీదికి ప్రసరించిన రామిరెడ్డివాంఛ గోడమీదికి విసరికొట్టబడిన బంతిలాగు వెనక్కు తిరిగి వచ్చేసింది. తలపులు అరుణకేసి పరుగెత్తినై. తానెన్నడూ అనుకోని విషయం విన్నాడు. అరుణ తన్నే ప్రేమిస్తోందా ?

ఆనాడు తనప్రేమ తెలిపినప్పుడు 'మానాన్నతో చెప్పండి' అన్న ఆమెమాటల అర్థంకూడా అతని కప్పుడు గోచరించింది పెండ్లికి ఆయన అనుమతి పొందమని తన కాదేశం కావాలది.

ఈ పల్లెటూరి పిల్లలకు ప్రేమ అంటే పెండ్లాడి, పిల్లల్ని కనటమని భావం. శృంగారం, రసికత వాళ్ళకర్థంకాదు—అనుకుని రామిరెడ్డి తనలో నవ్వుకున్నాడు.

రోజులు గడుస్తోన్నకొద్దీ రామిరెడ్డి వ్యవహారపు చిక్కులు మరీ క్లిష్టంగా పరిణమిస్తున్నవి. బాకీలవాళ్లు తొందర చేస్తున్నారు. ఇద్దరు ముగ్గురు నోట్లకు లిమిటేషన్ పడుతుందేమోనన్న భయంచేత అతనిమీద కోర్టులో దావా పడేశారు. తనకు బాకీవున్న కొద్దిమందీ సందుదొరికితే ఎగవేయాలనే ప్రయత్నంలో ఉన్నట్టు రామిరెడ్డికి అనుమానం కలిగింది. అంచేత వాళ్ళమీద తాను దావా వేశాడు ఈదావాలమూలాన అడుగడుక్కీ జిల్లా ముఖ్యపట్నానికి వెళ్ళి ప్లీడరుతో మాట్లాడి రావలసిన అగత్యం ఏర్పడ్డది. ప్లీడరు ఫీసుకోసం, కోర్టు ఖర్చులకోసం కొత్త అప్పులు చేయవలసివస్తోంది. మానసిక క్లేశంతోపాటు శరీరాయాసం కూడాను.

పైగా — మరికొంతమంది అతని తండ్రిగారికి కొంతపైకం దాచిపెట్టమని ఇచ్చినట్టు చెబుతూ, అది అతన్ని ఇవ్వవలసినదిగా కోరుతున్నారు. పత్రాలూ, సాక్ష్యాలూ లేకండానే పల్లెటూళ్ళలో పరస్పర విశ్వాసంచొప్పున ఇటువంటి లావాదేవీలు ఉండటం వాస్తవమే. కాని రామిరెడ్డి కేమిటి నమ్మకం? వాళ్లు నిజంగా పైకం ఇచ్చారో, లేదో, అట్లని తానిప్పుడు వాళ్ళను తోసివేస్తే ఆడిపోసుకునేట్టున్నారు. ఇవ్వటానికా మన సొప్పటంలేదు ; డబ్బూ లేదు.

డాక్టరుపరీక్ష ప్యాసైకూడా, ధనవంతుని కొడుకునన్న అహంభావంతో ప్రాక్టీసుమాట తలపెట్టక పట్నాల్లో వెలకు దొరకిన సుఖాల్ని అనుభవిస్తూ కులాసాగా కాలక్షేపం చేసిన రామిరెడ్డికి ఇలాంటి పరిస్థితులు తలవని తలంపుగా ఏర్పడేసరికి ఉక్కిరిబిక్కిరైనాడు. ఎల్లప్పుడూ పులుకడిగినముత్యంలాగ ఉండిన అతనికి ఇప్పుడు క్రాపు చెదిరినసంగతిగాని, దుస్తులు మాసిన విషయంగాని గమనింపుకు రావటంలేదు. ఎక్కడ కూచుంటే అక్కడ గంటలతరబడి ఏమిటో ఆలోచించుకుంటూ ఉండిపోతున్నాడు. వ్యాకులత, అసంతృప్తి, విషాదం ముఖాన అలముకుంటున్నవి.

'ఎట్లాగో ఉంటున్నారే అయ్యగారు!' అని తరచు అనసాగిన పనిమనిషికి ఒక తెచ్చుకోలు చిరునవ్వుమాత్రమే జవాబయింది.

ఉన్న యావదాస్తినీ తెగనమ్మి

ఈ అప్పులపీడ వొదిలించేసుకోవాలనిపించేది రామిరెడ్డికప్పుడప్పుడు, కాని అది తొందరపడి చేసినట్లవుతుందేమోనని జంకేవాడు. చక్కని సలహాలిస్తూ, సాధ్యమైనంత వరకు తోడ్పడుతోన్నాడు పెద్ద కాపు, ఐనా అతనికి శాంతి చేకూరటంలేదు. ఇంత చీకాకులో 'రామాన్ను' 'రామాన్న' అన్న అంతరాత్మ సంగీతం ఎక్కడ అడగిపోయిందో! ఇంకో హృదయంకోసం—తన హృదయంతో పాటు సమానతూకంగా స్పందించేటువంటిది—తన హృదయభారాన్ని పంచుకుని ఊరట ప్రసాదింపజాలినది—మరో హృదయంకోసం ఆవ్యక్తవాంఛ ఒకటి అంతస్సులో జ్వలిస్తోన్నట్టు అతనికి తెలుస్తోంది.

తలవెంట్రుకలంతిమంది స్నేహితులున్నారు— కాకిచేత కబురు చేస్తే రెక్కలు కట్టుకువచ్చి తన సుఖభోగాల్ని పంచుకుని తన్ను సంతోషపెట్టినవాళ్లు, ఇప్పుడు వారంతా సానుభూతి- ఉత్తరాలు రాశారు. ఇలాగ కాలం మారివచ్చినందుకు చాల దుఃఖిస్తున్నారట. దుఃఖించట మేమిటి, దుఃఖమే తామై మిగిలి ఉన్నారట. శీఘ్రంలోనే భగవదనుగ్రహంకోసం ప్రార్థిస్తున్నారట—ఆ చివరవాక్యం చదువుతున్నప్పుడు, అయిదారు నెలల క్రితం ఒకనాటిరాత్రి, మెసానిక్ లాడ్జిలో దేవుడేలేడని వాళ్ళు చేసిన తీవ్రవాదం రామిరెడ్డికి జ్ఞాపకం వచ్చింది.

రోజులు గడచిపోతున్నాయే గాని వ్యవహారాలు ఒక విధంగా చక్కబడే లక్షణాలేమీ కనిపించటంలేదు. ఒకనాడు ఉదయాన ప్లీడరువద్దకు వెళ్ళి మాట్లాడి వచ్చేనిమిత్తం రామిరెడ్డి బయలుదేరబోతుంటే పోస్టుబంట్రోతు మూడు ఉత్తరాలు ఇచ్చి వెళ్ళాడు.

ఒక ముసలి రిటైర్డు ఉద్యోగస్థుని పడుచుభార్య రాసిన లేఖ ఒకటి. ఆమె కీమధ్య ఒక పుత్రుడు కలిగాట్ట. రామిరెడ్డి వచ్చి చూడాలిట. 'పసివాడు నువ్వేమి బహుమానాలు తెస్తావో అని ఎదురు చూస్తున్నాడు' అన్న వాక్యం చదువుతున్నప్పుడు రామిరెడ్డికి నవ్వొచ్చింది.

రెండో ఉత్తరంలో ఒక విలాసిని తన వివాహానికి రామిరెడ్డిని ఆహ్వానించింది. 'నువు రాకపోతే నాకు పెండ్లి వేడుకలు నచ్చవు' అని రాసింది.

మూడో ఉత్తరంలో ఒక యువతి 'పల్లెటూరి నిస్సారమైన వాతావరణంలో ఎన్నాళ్ళుంటావు?' అని ఎగతాళిచేస్తూ 'ఇక్కడ పట్నంలో నువు లేకపోవటం మూలాన్ని క్లబ్బులూ, నృత్యశాలలూ వెలవెల బోతున్నై' అని తెలియజేసింది.

ఒక్కసారి రామిరెడ్డికి తాను పూర్వం అనుభవించిన ఆ 'దివ్య ప్రపంచం' కన్నులముందు మెరిసింది. అప్పులు, పరిష్కారాలు, ప్లీడర్లు—ఈ మురికినుంచి అక్కడికి ఎగిరిపోదా మనిపించింది. కాని—

పూర్వం తన జేబులనిండా డబ్బు ఉండేది. ఇప్పు డేముంది?

డబ్బే దేవతగా కొలువబడే ఆ ప్రపంచంలో తాను పూర్వంవలే రాణించగలడా! దేవతలచేత నెట్టివేయబడిన త్రిశంకుడువలె అయితా నప్పుడే విశ్వామిత్రుణ్ణి ప్రార్థించవలె? ..

ఉత్తరాల్ని దస్కులో దాచేసి రామిరెడ్డి ప్లీడరుకోసం ప్రయాణమై వెళ్ళాడు.

మర్నాడు సాయంత్రం నాలుగు గంటలకు రామిరెడ్డి ఊరినించి తిరిగి వచ్చాడు. అది ఫాల్గుణమాసం, ఎండబాగా కాసిం దానాడు. ఇంటికి వచ్చాక వేన్నీళ్లు కాచుకుని స్నానంచేసి ప్రయాణపు బడలిక తీర్చుకున్నాడు.

ఉదికిన దుస్తులు ధరించి పడకకుర్చీ పెరటివేపు ద్వారంవద్దకు లాక్కుని కూచున్నాడు. అటు జామచెట్టుమీదుగా ఆకాశభాగాన సాంధ్యరాగాలు అలముకుంటున్నై. మావిగున్న కొమ్మమీద గోరువంక దంపతు లేమో ముచ్చట లాడుతున్నవి. పొలాలనించి అలసటతో ఇంటికి వస్తోన్న కాపుకుర్రవాళ్ళ పాటలు వినిపిస్తున్నవి. రామిరెడ్డి మనస్సు అసమయాన కొంచెము ప్రసన్నంగా ఉన్నట్టనిపించింది.

అరుణ తలపుకు వచ్చిందప్పుడు. పనిమనిషి చెప్పినట్టు నిజంగా ఆ పిల్ల తనమీద ప్రేమ కలదైతే మాటల్లోగాని, నడవడికలోగాని రవంతైనా చూపెట్టదేం?

అలా అనుకుంటున్న అతని నేత్రాలు మూసికున్నకు పక్కగా ఉన్న మల్లెపొదమీద వాలినవి. రాబోయే వసంతకాలాన్ని ప్రశంసిస్తూ—ముగ్ధబాలిక హృదయంలోని తొలివలపు కోరికల్లాగ—మల్లెమొగ్గలు పొదనిండా చెల్లాచెదరుగా ఉన్నవి. వికచదరహాసం లేదని, వాటికి అందం లేదని, వలపు తావులు లేవని ఎవరంటారు?

మల్లెమొగ్గల సోయగంలో మునిగిపోయి, పనిమనిషివచ్చి సందెకసువు చిమ్ముతున్న సంగతికూడా రామిరెడ్డి గ్రహించలేదు. కొంతసేపటికి—

'మీరంతా ఇయ్యాళ ఉత్తసేతుల్తో వెల్లిపోవాల్సిందే మల్లెమొగ్గలన్నీ మా అరుణమ్మగారికే తీసికెల్లిపోతాను' అని అరుణకు తప్ప ఆ మల్లెమొగ్గలమీద మరెవ్వరికీ హక్కులేదన్నట్టుగా—రోజూమల్లేనే మల్లెపూలకోసం జడలల్లుకుని వచ్చిన ముగ్గురు నలుగురు ఆడపిల్లలతో అంటోన్న పనిమనిషి మాటలు చెవినిబడి రామిరెడ్డి పక్కకు తిరిగి చూచాడు.

భావగర్భితంగా తానన్నా ననుకున్న ఆ మాటలకు రామిరెడ్డి ముఖకవళిక ఎలా అభినందిస్తుందో తెలుసుకుందామన్నట్టుగా అతనికేసి చూచింది పనిమనిషి.

వచ్చిన బాలికలు పోకుండా తలా కాసినైనా కోసిపెట్టమని బ్రతిమాలారు. పనిమనిషి ఎలాగైతే నేమి వాళ్ళను వట్టి చేతులతోనే పంపించేసింది.

దాని ప్రవర్తన ఆనాడు చాల విపరీతంగా ఉంది, రామిరెడ్డి కర్థం కాలేదు. సందెకసువు చిమ్ముతూ మాటిమాటికీ తనకేసి చూస్తూ మందహాసం తెచ్చుకుంటుంది. అది వలపు చిహ్నమేమీ కాదు. దాని హృదయంలో ప్రవేశించిన ఒక కొత్త ఆనందాన్ని—అందుకు కారణాన్ని బయలుపరచాలన్న ఒక ఆందరపాటును—ప్రదర్శిస్తోంది దాని కవళిక.

రామిరెడ్డి ఊరుకోలేక అడిగాడు: 'చాల సంతోషంగా ఉన్నావే, గొల్లా! ఇవాళ ఏమిటి కథ?'

ఈ ప్రశ్నకోసమే అది ఎదురు చూస్తున్నట్టుంది. వెంటనే చెప్పింది: 'ఇయ్యాళ అరుణమ్మగారు చాల సంతోసంగా ఉంటారు. ఆవిడగారి పెండ్లైపోద్దంట వచ్చే నెల్లోపునే మళ్ళీ మంచి మూర్తాలు దొరకవంట ఇందాక పెద్దయ్యగారు అమ్మగారితో (అరుణ తల్లి) అంటుండరు.'

'నీ పెండ్లే అయిపోతున్నట్టు సంతోషిస్తున్నావేమిటే?' అని ఎగ

జాలిగా అన్నా రామిరెడ్డి హృదయంలో—ఇతర్ల సంతోషమే తన సంతోషంగా భావిస్తోన్న దాని అమాయికతకు మెప్పుదల పొడసూపింది. అమాయికతలో కూడా అందం ఉందన్న సంగతి అతడు గ్రహించటమదే తొలిసారి.

అరుణ ఎవర్నో పెండ్లాడి వెళ్ళిపోతుంది కాబో లనుకున్నప్పుడు హృదయంలో ఒక ఈర్ష్యాభావం రేకెత్తటం రామిరెడ్డి అనుభవించాడు. పరహస్తగతం కాబోతున్న ఆమె, తాను కోరినది కాకపోయినా, తన్నుకోరిన వ్యక్తియని తెలుసుకున్నందుచేతనేమో. లేక తనకు తెలియకుండానే తన అంతరాత్మ ఆమెను కోరుతున్నదా?

పనిమనిషిని అడిగాడు: 'అరుణ సంతోషానికి కారణం పెండ్లి కాబోతున్నదనేనా?'

'అంతేకాదండీ' అని పనిమనిషి నాటి మధ్యాహ్నం పెద్దకాపుగారు కూతురిపెండ్లిని గురించి భార్యతో ప్రసంగిస్తోండగా తాను విన్న సంగతులన్నీ చెప్పేసింది.

అంతా విన్నాడు రామిరెడ్డి. పెండ్లికొడుకు తనేనట. తన బాకీలన్నీ తీరటానికి కావలసినంత ధనాన్ని కట్నంరూపంగా ఇవ్వాలని పెద్దకాపుగారి సంకల్పమట. బాకీలన్నీ తీరి, వ్యవహారపుచిక్కులు విడిపోయి, తనకు శాంతి చేకూరుతుందని అరుణ సంతోషిస్తున్నదంటే తనపట్ల ఆమె ఎంత స్నిగ్ధభావంతో ఉన్నదో తెలుస్తున్నది. ఆమె హృదయం తన హృదయానికెంతో సన్నిహితంగా ఉన్నది. అటువంటి ప్రేమమయి ఒక్కసారయినా తనకేసి క్రీగంటిచూపుగాని, దరహాసంగాని ప్రసరించలేదేం?

అప్పుడొక చల్లనిగాలి కెరటం వికచదరహాసంలేని అక్కడి మల్లెమొగ్గల వలపు తావుల్ని మోసుకొచ్చి రామిరెడ్డి చుట్టూ వెదజల్లింది.

సందెపనులు పూర్తిచేసుకొని ఇంటికిపోయే ముందు పనిమనిషి అరుణకోసం మల్లెమొగ్గలు కోసుకుంటూ 'మా అరుణమ్మగారికి మల్లెమొగ్గలంటే చాలా యిష్టమండీ!' అంది.

'ఆమెకూడా ఒక మల్లెమొగ్గ కనుక'—అరుణను గురించిన రామిరెడ్డిగారి ఈ అభినందన వాక్యానికి పనిమనిషి ఎంతో సంతోషపడ్డది.

మర్నాడు సాయంత్రమప్పుడు రామిరెడ్డి బావిలోనించి నీళ్లుతోడి మల్లెచెట్లకు పోస్తూండగా పనిమనిషి సందెపనికి వచ్చి,

'అయ్యగారు కష్టం చేస్తుండరే' అని ఆశ్చర్యంగా అంది.

'నాకూ మల్లెమొగ్గలంటే యిష్టం కలిగిందే గొల్లా!' అన్నాడు రామిరెడ్డి.

... ... ...

పెండ్లిపీటలమీద అరుణనూ రామిరెడ్డినీ చూచి పనిమనిషి చాల సంతోషపడ్డది. పెండ్లిపెద్దలను మించిన వ్యగ్రత చూపుతూ, సంతోషంతో, ఉత్సాహంతో పెండ్లిపనులు నిర్వహించిన దాన్ని ఎలా బహూకరించాలో రామిరెడ్డికి ఒక సమస్య అయింది.

పెండ్లి వేడుకలు ఆ నవ వసంత మాసంలో తొలికారు మల్లెమొగ్గల వలపు తావులతో గుబాళించినవి.

అందరూ సంతోషించారు ఆ పల్లెటూరిలో. రామిరెడ్డి కట్నం నిరాకరించినందుకు పెద్దకాపుగారు మాత్రం కొంచెము కించపడ్డాడు.

---

# తేలు బాధ

## నిమిషంలో నివారణ

తేలు కుట్టినవారికి తెలియకుండా పిడికెడు దుష్టపాకును తెచ్చి బాగా నలిపి, వేరే యేదైనా ఆకును దొన్నెగా చేసి, అందులో నలిచిన ఆకురసమును పిండి రెండు మిళ్ళిగరిటెల ప్రమాణం త్రాగించి, విషమెక్కియున్న చోటి నుండి, పసరుచేతితో పైనుండి క్రిందికి చరిమినట్లు లాగవలయును. ఆనలిచిన పిప్పిని కుట్టినచోట పెట్టి కట్టవలెను. ఇంతే చేయవలసింది. ఇక నిమిషంలో బాధ మాయమౌతుంది.

—పురాణం పచ్చయ్య శాస్త్రి

# పల్లెపదాలు

[వీనిని సేకరించినది దేవగుప్తాపు వెంకటరమణమూర్తి పంతులు గారు వీనిని వరి ఊడ్పులలో విశాఖపట్టణం మండలంలోని స్త్రీలు పాడుతారు. 'రామనా చందినాలో' అను పల్లవి ప్రతి చరణము మొదటను పాడుతుండాలి. ఈపాటలోని మొదటి మూడు భాగాలు గత సంచికల్లో ప్రచురితాలు ఐనాయి. ఇక్కడ ప్రచురితమైనది నాలుగు, ఐదు, ఆరు భాగములు.

—సంపాదకుడు.]

## ౪

కోటకొమ్మున రెండూ కోరి వెలగాపల్లూ
కోరినా మావారు కొంగుబడితే చాలూ
ముసముసానవ్వులూ ముచ్చటాలాడంగా
మునిపల్లు సందుండీ ముత్యములు రాలేనా
కలకకా నవ్వేడే కన్నెత్తిచూచేడే
కన్యముఖమూమీదా కస్తురిజల్లూద్దూ
ఆవీధి నెళతాడే యీవీధి నొస్తాడే
వాడిముఖముమీద జల్లునునే కస్తురివాసనలూ
పీటంచు తలగుడ్డా తాటించి చుట్టేడూ
తలగుడ్డ మాయింట్లో తగిలించితే చాలూ

## ౫

నోమినోమల్లార నోమన్నలారా
నాపయ్యెదచెంగుమీద పావురాల నేతా
నాపినిచుట్టూ చెంగుమీద పిచ్చికల నేతా
నాడయ్యాల చెంగుమీద పులిపిల్ల నేతా
నామైజారు చెంగుమీద సామి డంచు నేతా
నాసాలూరు సంతలోనూ సన్నంపూ నేతా
నాబుడమూరు సంతలోనూ బుడతల్లా నేతా
నామొగ్గల్లూ తీర్చినారే మోహంపు కోకా

## ౬

నోమినోమల్లార నోమన్నలారా
ప్రొద్దుప్రొద్దున లేచీ ప్రొద్దున్న లేచి
ప్రొద్దున్నా రెమ్మా తానేమిపనులూ
ఇల్లువాకిలి తుడిచి ఇల్లలికి వేళీ
పేడకడవలుతుడిచీ పెంటలోబోశి
మాబాబుచెల్లెలా మాకు మేనత్తా
మాకేమి పనులేమీ చెప్పు మేనత్తా
ఎల్లుండి మనపొలము దమ్ములాడతారూ
కూలీలతోడుతనూ కూడెళ్లుతానూ
పాలోళ్లు తోడుతనూ పనికందలేమూ
కళ్ళమున కెళ్ళవే పిడకలూ తేవే
చలమయ్యపంచలో చుమ్మ లేదిశీ
వారిపంచనున్నదీ పగడాలతట్టా
బొంలా కాళ్ళతో పొంపుగానడచీ
యిసుకలో దానికాలూ ఇమ్ముగా నేళీ
పసకమీద దానికాలూ బారెత్తి నడచీ
పచ్చబొట్టులచెయ్యి బాగుగా విసిరీ
మూడుదొడ్డెలపేడా ముత్యాలరాశీ
ఏడుదొడ్డెలపేడా ఏకరాశోశీ
పాలిదొడ్డెలపేడా పగడాలరాశీ
ఆపేడ యీపేడా తట్టకెత్తిందీ
అరటితోటల్లోనూ అచ్చన్నమరదీ
రావయ్యా అచ్చన్నా తట్ట ఎత్తవలే
తట్టఎత్తినవద్దా తప్పులుంటాయీ
తప్పులుంటే నేనూ వప్పుకుంటానూ
చెరుకుతోటల్లోనీ చెల్లయ్యమరదీ
రావయ్యా చెల్లయ్యా తట్టఎత్తవలే
తట్టలెత్తినవద్దా తప్పులుంటాయీ
తప్పులొస్తే నేనూ వప్పుకుంటానూ
పసుపుతోటల్లోని పైడయ్యా మరదీ
రావయ్యా పైడయ్యా తట్టలెత్తవలే
తట్టలెత్తినవద్దా తప్పులుంటాయీ
తప్పులుంటే నేనూ వప్పుకుంటానూ
నల్లచెరువూవద్దా నాయుడచ్చన్నా
పడమరాగా లేశీ బొడ్డుకొంగోశిలీ
తూరుపున గాలేశీ పక్కచెంగోశిలీ
తట్టలెత్తినవద్దా నప్పకున్నాహో
కానియ్యా నారెమ్మా కంఠాన వుంచూ
వుంచుకోవే నారీ హృదయమున వుంచూ
ఏసాము గట్టింటా అచ్చన్న వెళ్ళీ

సంద్రాల కట్టింటా నారెమ్మ వెళ్ళీ
నారికన్ను ముందూ అచ్చన్న వెళ్ళీ
అమ్మరోనా అమ్మంమా ముగిన్నతల్లీ
కోడలు తెచ్చినతట్ట గందకే అమ్మా
కోడలుంచినతెప్పా చెప్పరా కోకా
చెప్పుతానే అమ్మా చెప్పదను వినుమూ
మన్ననారీచేతా తట్టె తుకుందీ
యింక మనగుంటికీ ఇల్లాలావిమా
యింక మన కుంటికీ కూండ అవుతుందా
అచ్చన్న వెళిపోయే నారివచ్చెనుగా
మాబాబుచెల్లెలా మాకు మేనత్తా
తట్టదించేవె అత్తా తట్టదించత్తా
నాకొడుకు అచ్చన్నా దించవద్దనెనూ
తోడికోడల్లారా తట్టదించెదరా
మీనాయు డచ్చన్నా దించవద్దనెనూ
ఆడబొట్టెలులారా తట్టదించెదరా
మాఅన్న అచ్చన్నా దించవద్దనెనూ
చిన్నింటి చిన్నత్తా తట్టదించెదవా
నాకొడుకు అచ్చన్నా దించవద్దనెనూ
పెద్దింటి పద్దత్తా తట్టదించెదవా
నాకొడుకు అచ్చన్నా దించవద్దనెనూ
యిరుగు పొరుగూలారా తట్టదించెదరా
మీనాయు డచ్చన్నా దించవద్దనెనూ
యీడుజోడుల్లారా తట్టదించెదరా
మీనాయు డచ్చన్నా దించవద్దనెనూ
నాతోడి చెలులారా తట్టదించెదరా
మీనాయు డచ్చన్నా దించవద్దనెనూ
నిలబడిన కాళ్ళకీనిలువు నెత్తురులూ
వాలేటి రెక్కలుకీ వాలె నెత్తురులూ
ఆనికను ఆతట్టా పూనికనుదించి
తొలగాననున్నాను తొంగరుకోకల్లూ
చంకలోనాకోకా చెలగి అమరించీ
మాబాబుచెల్లెలా నాకు మేనత్తా
నాతమ్ముడుక్రిష్టమ్మా కలలోనవచ్చే
పరితెగున్నానో ఎట్లగున్నానో
ఆకష్టసుఖములూ కళ్ళచూడలీ
తోటికోడల్లారా నేను వెల్లుదునా
ఆడబొట్టెలులారా నేను వెళ్ళుదునా
చిన్నింటి చిన్నత్తా నేను వెళ్ళుదునా
పెద్దింటి పెద్దత్తా నేను వెళ్ళుదునా
యీడుజోడుల్లారా నేను వెళ్ళుదునా
నాతోడి చెలులారా నేను వెళ్ళుదునా
సాగిందినారెమ్మా సోగవనములికీ
పుల్లితోటలుదాటీ వూరు లేదాటి
చెరుకుతోటలుదాటీ చేలన్ని దాటీ
వురియంగ పండేటీ పిప్పళ్లుదాటీ
వరుసగా పండేటీ వరికొయ్యదాటీ
ఘనముగా పండేటీ గంటికొయ్యదాటీ
సొగసుగాపండేటీ చోడికొయ్యదాటీ
యఱ్ఱంగపండేటీ గురివిందదాటీ
ఏనుగులు మేశేటీ ఎల్లంకిదాటీ
గుఱ్ఱాలు మేశేటీ గుజ్జంగిదాటీ
అరటితోటలుదాటీ వారిపట్నాలూ
అల్లంతదూరముగా తమ్ముడే మాచీ
వాళ్ళమ్మ దాలెమ్మా చల్లు లేదచ్చీ
అప్పుడే మనవారీ అప్పవచ్చినదీ
అప్ప వెళ్ళినత్రోవా మాయుటయెలేదూ
అప్ప దువ్వినబుఱ్ఱా చెరుగుటయెలేదూ
అప్ప బెట్టినబొట్టూ చెరుగుటయెలేదూ
అప్ప బెట్టినకన్ను కనుచదర లేదూ
అప్ప కట్టినకోకా మాయుటయెలేదూ
అప్ప అలికిన అలుకూ మాయుటయె లేదూ

[మిగతా ౩౫౩-వ పేజీలో.

# ప్రేమజ్యోతికి క్రీనీడ వుంటుందా?

రచయిత :

కొత్తపల్లి శ్రీ రామమూర్తి, యల్.యమ్.ఇ.



సంధ్యాసమయం. బీచి కిటకిటలాడిపోతోంది. రేడియోలో ఎవరో తెనుగు గాయకి కాబోలు జావళీ విసురుతోంది. ఆమె కంఠ మాధుర్యానికి తమిళ సోదరులు తన్మయులై తాళం వేస్తూ ఊహుఁ పూగిసలాడి పోతున్నారు. ఆ కంఠ మాధుర్యాన్ని గ్రోలిన కొందరు యువకులు ఆమె రూపం ఎంత...గా వుంటుందో అని కలలు గంటున్నారు.

ఆసమయంలో ఇందిర చంటిబిడ్డను ఎత్తుకుని హంసగమనంతో మూర్తి వెంట నడుస్తున్నది, యిసుకలో. ఆమె హటాత్తుగా ఆగిపోయింది సింహాన్ని చూసిన లేడిలాగు బెదురు చూపులతో.

ఇంతలో రామారావు కమలతో కలిసి యిటే వస్తున్నాడు. 'ఏం, అల్లా నిలిచిపోయావ్!' అన్నాడు మూర్తి వెనక్కు తిరిగి చూస్తూ. ఆమె వూరుకుంది. ''పిల్లవాణ్ణి ఇలా ఇయ్యి. కాస్సేపు నేను ఎత్తుకుంటాను'' అని వెనక్కి రెండడుగులు వేసి ఆమె చంకని వున్న కృష్ణుణ్ణి చటాల్న లాక్కున్నాడు మూర్తి. దీర్ఘమైన నిట్టూర్పు విడిచి, పమిట సర్దుకుని నడవసాగింది ఆమె. హృదయభారంతో తల వాలిపోయింది. అప్పటి ఆమె స్థితి...?

రెండడుగులు ముందుకి వేసేసరికి నమస్కారబాణం వేస్తూ 'మూర్తీ! సౌఖ్యమా!' అంటూ పలకరించాడు రామారావు. 'ఏదో మీదయవల్ల' అన్నాడు మూర్తి.

''ఎంత మాటన్నారు పెద్దలు, మమ్మల్ని అలా అనొచ్చా'' అంటూ, ''మీ అబ్బాయేనా!'' అని కృష్ణుణ్ణి ఎత్తుకుని ముద్దు పెట్టుకుని భార్యకిస్తూ—''అంతా వాళ్ళ అమ్మగారి పోలికే'' అన్నాడు చటుక్కున—సిగ్గుతో వెనక్కు నుంచున్న ఇందిర వేపు ఓరగా చూస్తూ.

'అదృష్టవంతుడు!' అని శిరం మూర్కొని హృదయానికి హత్తుకొన్నది పుత్రప్రేమను ఒలికిస్తూ, కమల. కొంటె కిష్టుడు ఆమె మెళ్ళోని హారాలు సవరించడం మొదలుపెట్టాడు.

'ఊఁ హుఁ!' పేరు పూరి కేపోతుందా! అంటూ బుగ్గలు చిదిమింది మందహాసంతో కమల. వాడు కేరుమన్నాడు. పిల్లవాని ఆర్తనాదం వినబడగానే చివాల్న ఆమె చేతినుండి లాక్కొని వెనక్కి తిరిగింది ఊరుకోబెట్టడానికి. ఆమె సిగ్గు ఎక్కడికి పోయిందో యేమో! రామారావువంక కన్నెత్తి చూడడానికయినా ఆమెమనస్సు అప్పుడు అంగీకరించలేదు. కాని, అతన్ని చూచినప్పుడల్లా ఆమె చిన్ననాటి చేష్టలు జ్ఞప్తికి రాగా, మెఱుపుదెబ్బతిన్నట్టు అనిపించేది. స్త్రీపురుష బేధంలేకుండా గడచిన ఆరోజులు ఆమెకు స్వప్నప్రాయంగా తోచినవి. ఆ స్ఫురణతో హృదయభారం అధికమయింది.

కాస్సేపు పిచ్చాపాటీ ముచ్చటించుకున్న తరవాత రామారావు కమలా వెళ్ళిపోయారు. రామారావు వున్నంతసేపు యిందిర పడ్డ కలవరపాటు మూర్తి గుర్తించక పోలేదు. పులివాతనుండి తప్పించుకున్న లేడి చందమైంది ఇందిర స్థితి. కొంచంసేపటికి సేద తీర్చుకుంది.

రామారావు ఉదంతం మూర్తికి పూర్తిగా తెలియదు. రామారావు మొదటిసారి ఇందిర పెళ్ళికి కనుపించాడు. అంతే.

అతని సంగతి తెలుసుకోవాలనే కుతూహలమే లేదు మూర్తికి. కాని భార్య కలవరపాటు చూస్తే అతనిసంగతి తెలుసుకోవాలని బుద్ధి పుట్టింది.

కాని అక్కడ ఎదటనే అడిగితే తను అనుమానపడ్డారని అనుకుంటుందని ఏమీమాటాడకుండా కాస్సేపు ప్రకృతి శోభను చూస్తూ ఆనందించి ఇంటికి చేరుకున్నారు.

భోజనాలయాక డాబామీద వెన్నెట్లో పక్క వేసుకొని కూచుని తమలపాకుల చిలకలు చుట్టి యిస్తోంటే 'వేసుకుంటూన్నాడు. 'నిన్ను అడగాలని ఎన్నోసారులు అనుకున్నానుగాని, జ్ఞాపకం వుండేదికాదు. కనపడ్డప్పుడల్లా పలుకరిస్తాడు ఆ రామారావు ఎవరి తాలూకు.' అని అతి తాపీగా అన్నాడు లోపలి అనుమానాన్ని కప్పిపుచ్చుతూ. ఇందిర కొంతసిగ్గుతో చెప్పడానికివెరచి తటపటాయించి దాచడంవల్ల యీదుడుకు యిలాగా వుండిపోతుందని ధైర్యం చేసి చెప్పింది యిట్లా. 'అతంది మావూరేనండి. నేనూ అతడు చిన్నప్పుడు ఒక బళ్లోనే చదువుకునేవాళ్ళం. అతని చెల్లెలూ నేనూ ఒకక్లాసులో చదువుకున్నాం. ఆఅమ్మాయీ నేనూ ఆడుకుంటూ వుండేవాళ్ళం. వాళ్ళింటిదగ్గిర...'' అని అతి ఆయాసంతో చెప్పింది. యిక నాలిక మెదిలిందికాదు, కాని అతన్నిగురించి తలుచుకునే సరికి విసువు కలిగింది. ఎందుకో ఆమెకూ తెలియదు. ఇంక చెప్పడానికి యిష్టంలేక మౌనం వహించింది.

ఆవలిస్తే పేగులు లెక్కించే మేధావంతుడు మూర్తి. అంతా అర్థమైంది. 'బాల్యస్నేహితుడు బంధువులకన్నా అప్తులన్నారు యిందుకే.' అంటూ ఆమె యిచ్చే చిలకలు అందుకుంటూ చేయి గట్టిగా పట్టుకున్నాడు. చేయిపట్టుకోగానే సిగ్గుచే వరిగిపోయింది అతనినివళ్లో.

... ... ...

ఇందిర సంపన్నగృహస్థుని ఏకైక పుత్రిక. తండ్రి సుందర్రావు.. తల్లి శేషమ్మ. ఒక్కగా నొక్క కూతురవడంవల్ల అందులో వాళ్ళ ప్రేమకు తొలిఫల మగుటవల్ల ఆ పిల్లను అల్లారుముద్దుగా పువ్వుల్లో పెట్టి పెంచారు. అయిదోయేడు రాగానే బళ్ళో వేసారు. దినదినాభివృద్ధిగా, పెరుగుతోంది శుక్లపక్ష చంద్రునివలె. ఆమె వయస్సుతో కూడా పెరిగింది పెంకితనం. ఆమెకు పన్నిండేళ్ళు నిండాయి.

తారామనోహరునికైనా కళంకం వుందేమోకాని ఆమె ముఖ కమలానికి కళంకమేలేదు. ఆమె ముంగురులు ఆమె ముఖసరోజం మీద చిందులాడుతూవున్నాయి పద్మంలోని మధువుకై ప్రాకులాడే కొదమ తుమ్మెదలాగ. కంఠమెత్తితే భువనమోహనంగా పాడే కోకిలకూడా సిగ్గుచే తొలగిపోతుందా మెముందు మేని ఛాయ పండ్రెండోవన్నె బంగారంలావుంటుంది. ఆమె కనుబొమ్మలు కాముని శరాసనంలా వున్నాయి. యవ్వనం ఆమె అవయవాల్లో ప్రస్ఫుటంగా వ్యక్తమౌతోంది. ఆమె తేనెలొలుకు పలుకులు విన్నవారందరు తన్మయత చెందుతారు.

ఆమె అభమూ శుభమూ తెలియని అమాయకురాలు. ఆమె లావణ్యానికి తగిన నాజూకు, నాజూక్కి తగిన విద్యా, విద్యకు తగిన వివేకం వున్నాయి. మొత్తంమీద తారుమెఱుగులలో ఆమె మెఱుగు తీగ అని చెప్పవచ్చు.

ఆమె బడిలో చదువుకుంటూ వుండేది. చదివేది అయిదోక్లాసు. ఆమెకు మాలతి అనే స్నేహితురాలు వుండేది. ఆ స్నేహితురాలుతో తరచు వాళ్ళయింటికి పోయేది ఆటపాటలకు. మాలతికీ ఇందిరకూ గాఢమైన నేస్తం అన్నం తినటమే తడవు, వాళ్ళయింటికి పొట్టిపిచికిలా పారిపోయేది ఇందిర.

మాలతిది పెద్దభవనం. ముందు దొడ్డిలో మల్లెపందిరి వుంది. పెరటి దొడ్డిలో చామంతి జాజి సంపెంగ మాలతీమాధవం రాధామనోహరం మొదలైన పుష్పజాతులు అనేకం వున్నాయి. మాలతీ ఇందిరలు పువ్వులన్నీ కోసికొని జెడలనిండ తురుముకుని రంభా ఊర్వశీలకు

మళ్లే తయారయేవారు. మాలతి ఇందిరకన్నా రెండేళ్ళు పెద్ద ఆమె నిండుజవ్వనే కాని పెండ్లి కాలేదు. ఆమెకు రామారావు, ఆనందరావు అని యిద్దరు అన్నలు.

రామారావు యుక్తవయస్కుడు ప్రపంచాన్నంతా ఉర్రూత లూగించే ప్రణయవాహిని ఒడ్డున కొట్టుకు పోవుటకు సిద్ధంగా వున్నాడు. అతని కంటికి ఇందిర నావలా కనుపించింది. నిత్యము అతని ఎదుట నాట్యం చేస్తున్న ఆ కనకపు బొమ్మ అతన్ని ముగ్ధుణ్ణి చేసింది

అరిటాకు ముల్లుమీద పడ్డా ముల్లు అరిటాకుమీదపడ్డా అరిటాకుకే మోసం. ఏవిధంగానైనా ఆమెను వశంచేసుకోవాలని సంకల్పించుకున్నాడు. ఆమె ఉత్తమజాతిస్త్రీ అనీ అందని ద్రాక్షపండనీ దృఢంగా తెలిసినా, ఆమె అనురాగానికి పాత్రుడు కావాలని ప్రాకులాడాడు. సంధానానికి చెల్లెలను ప్రోత్సహించాడు. తన చెల్లెలితో కలసి ఆటపాటలు ఆమెతో ఆడడం ప్రారంభించాడు. ఆటల్లో ఆమెను స్పృశించి ఆనందించేవాడు. అతని స్పర్శ ఆమెకు చక్కిలిగింతలు పెట్టినట్టు వుండి ఏదో తెలియని ఆనందం పొందేది.

కాకిగూటిలో పెరిగే కోకిల పిల్లకి కాకికూతే గొప్పగా వుంటుంది. కాని తను కాకివలె కూయాలనుకుని కూయబోయినప్పుడే కదా తన కంఠమాధుర్యం తెలిసేది. ఇందిరకు రామారావు తీసే కూనిరాగాలమీద అభిమానం కలిగింది. వాళ్ళ యింటికి వెళ్ళినప్పుడల్లా 'ఏమోయ్, ఒకపాటపాడవో' అని ప్రాధేయపడేది. చక్కని చుక్క పాడమని ప్రాధేయపడితే వెనుదీసే మొగాడు ఎవడుంటాడు! పాడమని అడగటమే తరువాయిగా 'ఛల్! మోహనరంగా, నీకు నాకు జోడుఅయితే మల్లిపూల తెప్పగట్టి తేలిపోదముగదరా, అన్న పాట పాడేవాడు.

పాటమాధుర్యానికి తోడు అతని పలుకు యింపు సొంపులు అతీతం అదిగాక పువ్వుబోడుల హృదయకమలములను వికసింపచేయగలది ఒక్క మధురవాక్కే. తీయని వాక్సుధారసం చిలికించేవారికి మగువ అరచేతిలోని ఆమలకము. మంత్రదష్టమైన పన్నగము స్త్రీని మెప్పించాలంటే ఆమెతో తీయని సరసాలాపములు ఆడటమే. ఎన్ని భూషణాలు పెట్టిన మగడు ఎంత అందగాడైనా ఆమెకు అవి అన్ని తృణప్రాయమే. ఆమె అందచందాలు కొనియాడుతూ తీయగా మాటలు

# స్నేహము

ఆపదలయందు స్నేహమే ఆదరించు,
కష్టకాలాన మిత్రుడు కరుణ చూచు,
సుఖము చేకూర, కూర్మియు సౌఖ్యమందు,
నిటులనే స్నేహ మెపుడును నిడ విధము
బరగు కష్ట సుఖములందు పాలుగొంచు.

అరయ సాంగత్యమున సద సత్తు నిర్ణ
యాన, మన యంతరంబులే మంచిసాక్షి
కాని మైత్రియు దూషింప కానిదగును
దుష్ట బుద్ధియె మనుజుని దుష్టతయును.

కలరు మిత్రులు మనకు కరవు దీర:
మైత్రి యనపేర నెందరో మంత్రగాళ్లు!
చింత నేపలు గలసిన వింత లేదు:
ఈత పోతలు గలయుట యిలను గలదె?

—కల్లలమఱ్ఱి వేంకటహనుమంతరావు.

చెప్పే వానికి ఆమె హృదయమును అర్పిస్తుంది.

పుట్టుకతోనే ఈరహస్యం తెలిసికొన్న రామారావు ఉబ్బించే వాడు. ఆమె సౌందర్యానికి వూరికే పొగిడే వాడు. అతని పొగడ్తలకు మురిసిపోనివారు మానవుల్లో వుండరు. అందులోను స్త్రీలను చెప్పాలా! ఉబ్బేస్తే ఎంతపనేనా చేస్తారు.

పాటలలోను ఆటలలోను మునిగి తేలే ఆ ఇందిర ప్రపంచాన్ని మరిచిపోయింది.

ఉషఃకాంతులకు అరవిచ్చిన పద్మంలాగ ఆమె నిర్మలహృదయం వికసించింది. మధువుకై కాచియున్న మధుపము ఝుమ్మని పద్మగర్భంలో చేరినట్టు, ప్రపంచమే ఆటపాటలుగా భావించిన ఆ లేత హృదయం చెలికత్తె ప్రోత్సాహముమీద అతనిమీద నాటుకుంది. ఆ సంగతి ఆమెకు తెలియదు. పొంగి పొరలివచ్చేనది తను సముద్రములో చేరితే తన సహజమాధుర్యం కోలిపోతాను అనుకుంటుందా? మా అన్నయ్యని చేసుకో ఇందిరా. నువ్వూ నేనూ ఒకచోట వుండచ్చు అంటే తెలియని స్థితిలో 'ఊ' అనేసింది. చంద్రముఖ నా చేత చిక్కినదికదా అని మురిసిపోయాడు రామారావు.

కాలపురుషునికి యువతీ యువకులమీద అపరిమితమైన కసి. కాగా, కాలం తారుమారుచేసాడు. వారి అన్యోన్యతకి భంగం కల్పించాడు విధి. మాలతి పెండ్లి చేసుకొని అత్తవారింటికి పోయింది.

---

# ఎవరోయి?

నాకు తోడెవ్వరోయీ?
నాకు రేడెవ్వరోయీ?

కటికి చీకటి
కాటి కాపరి
భీతిగొలిపే
బ్రహ్మరాక్షసి!

నాకు తోడెవ్వరోయీ?
నాకు రేడెవ్వరోయీ?

విరహ తాపం
వేడిగాడ్పులు
రెచ్చగొట్టే
రమణి రూపం!

నాకు తోడెవ్వరోయీ?
నాకు రేడెవ్వరోయీ?

స్వార్థజీవులు
వర్థచింతన
కొట్టుకెళ్ళే
కాలవాహిని!

నాకు తోడెవ్వరోయీ!
నాకు రేడెవ్వరోయీ!

పిల్లలమర్రి
వేంకటహనుమంతరావు.

---

స్త్రీలు ఎప్పటికైనా మగవారి సొత్తేకదా. ఎంత స్వేచ్ఛాజీవులైనా మగవానికి లోకువే కదా!

ఇందిర పుష్పవతి అయింది.

తలి తండ్రులు చదువు మాన్పించి పెండ్లి ప్రయత్నాలు సాగించారు. ఎన్నో సంబంధాలు వచ్చాయి. అయ్యమ్మకి నచ్చలేదని అమ్మమ్మకి నచ్చలేదని అన్నీ తిరగొట్టేసారు. తుదకి మూర్తి వెళ్లాడు. అంతా ఘటన. ఏం చెప్పను.

పెళ్ళితీరులు ఆపిల్లకు నచ్చలేదు రామారావుని చేసుకుంటే బాగుండునని హృదయంలో వాంఛ. కాని పాత ఒక రోతను పుట్టించునన్న వివేకం ఆమెకు ఎక్కడిది! దిగిన తరువాత కదా, లోతు తెలిసేది. ఏమీ చెప్పలేక మౌనంతాల్చింది. హృదయవాంఛను చంపుకుంది.

కన్నీటితోనే భర్తకి తలంబ్రాలుపోసింది. పెండ్లి అయింది, కాపరానికి వెళ్ళింది. ఆ నూతన సంసారంలో వుండగా రామారావుతో గడపిన దినాలు జ్ఞాపకంవస్తే నిశ్చేష్టురాలై నిలువునా నీరైపోతుంది. అనుకున్నవాణ్ణి పొందలేకపోయానుగదా అని హృదయం తహతహపడుతున్నది ఆమెకు. కాని అట్టి భావం లేనట్టుగా నటించాలని నటించలేక బాధపడుతుంది. ఇట్లా కొంతకాలం జరిగింది.

కాని కాలపురుషుడు అనుగ్ర

హిస్తే యవ్వనం శాశ్వతమా— కాపరానికి వెళ్ళిన ఏడాదిలోనే దాంపత్యఫలంగా ఆమెకు తొలి కాన్పు- ఒక కుమారుడు పుట్టాడు!

ఆమెకు యిప్పుడు ఆకుమారుడే సర్వస్వమూను. అతని కరపల్లవములే ఆమె కన్నుల వైకుంఠము. అతడనే 'తాతా' శబ్దమే ఆమెకు భువనమోహన గీతము. అతని తుంపర్లధ్వనే వీణారవములు. ఆమె ప్రేమ హృదయంలో ఆపిల్లవానికి తప్ప ఇతర్లకు తావు లేదు. రామారావును పూర్తిగా మరచిపోయింది ఆచిన్నిబాలుని సేవలో. కాని యిప్పటికికూడా రామారావు కనిపిస్తే బాల్యక్రీడలు స్ఫురణకు వచ్చి భయపడుతుంది శీలానికి లోపం కలిగిందేమో అన్న అనుమానంచేత. రామారావు కమలను పెండ్లిచేసుకొని సుఖంగా వున్నాడని తెలుసుకొన్న వెనుక, యువకుల చేష్టలు కామపూరితాలుగాని ప్రేమ పూరితాలు కావని గ్రహించుకుంది.

కామము చీకటిని కోరుతుంది. ప్రేమ వెలుగు నిస్తుంది. అందుకే ప్రేమజ్యోతి అన్నాడు. కాని ప్రతీ దీపానికి క్రీనీడ వుండునుగాన ప్రేమ స్వచ్ఛతకు కూడా కొంచెం లోపముందేమో, దానికి కూడా కామ సంపర్కం వుందేమోనని ఆత్మ పరీక్ష చేసుకొంటూ వుంటుంది. కాని కుమారుడు కలిగాక ఆమెకు యావత్ ప్రపంచం ఆ బాలుని చిరు హాసంలో ప్రత్యక్షమౌతుంది. ఆ పిల్లవానిని ఆమె అక్కున అదుముకున్నప్పుడు ఆమె యీ బాహ్య ప్రపంచాన్నే మరిచిపోతుంది.

# త్యాగశీల భూమాత

రచయితి:

"సుమంత"

భూగోళోపరిభాగమున నివసించు మనుష్యులలో విశేషముగా సహకారము కన్పడకపోయినను వారు ప్రకృతికి లోబడియుండు శరీరముతో నున్నంతకాలము తనతో సృష్టిగావింపబడిన చెట్లు చేమలతోను, జంతుజాలములతోను, భూమాతతోను, నీరు, వాయువుతోను సంధిచేసుకొననిచో బ్రతుకుట దుర్లభమని చెప్పకతప్పదు.

భూమిని సరియగు కాలమున, లోతుగాదున్ని, సమయోచితముగ ఎరువులు వేసి, ఉత్కృష్టఫలము నిచ్చు మంచి పంటగింజలను వేసిననేగాని 'బువ్వ' రాదుగద, గింజరూపముననను, గడ్డిరూపముగనను మనము తీయుసత్తువను, తిరిగి భూమికి ఎరువులరూపమున నిచ్చిననే గదా ఫలసాయము లభించుట. సూర్యకిరణోష్ణముచే వాయురూపమున నెగసెడు నీటివాయువు కొండలను తాకినప్పుడే వర్షించుటయు, లవణవార్ధినుండి ఈప్రకారముననే పరిశుభ్రోదకము లభించుటయు మనుష్యనిర్మాణము కాదుగదా మనుష్యుడు త్రాగుటకు వీలుపడని లవణోదకమునుండి ఏవిధముగా సృష్టివైచిత్ర్యముచే పానీయోదకము తయారగుచున్నదో, అట్టి ఇంకొక ప్రకృతి రహస్యముచేత, తనకు పనికిరాని మలమూత్రాదులు, భూములసారమును అభివృద్ధిచేయుదగియుండి, సకల సస్యపోషణకుపయుక్తములగుచున్నవి. పశువులకు వలయు గడ్డిదినుసులు, గానుగపిండ్లు, మొదలగునవి భూమాతయొక్క కారుణ్యవశమున లభ్యమై, వాటి మలమూత్రములును, వాటికి పనికిరాని చెత్తచెదారములును చేలకు "సహజమైన ఆహారములు"గాను, ప్రాణపు టెరువులుగాను పరిగణింపబడుచున్నవి-

ఒక్క ధీశక్తిని మినహాయించినచో, మనుష్యుడుకూడ పశుతుల్యుడేగనుక తానును తనతోడి జంతుజాలములును నిరంతరము పీల్చెడి ప్రాణవాయు లభించుటకు చెట్లు చేమలపై నాధారపడవలసియున్నది- ఏసృష్టి నిర్మాణమునో జంతువులకు ప్రాణవాయువు అవశ్యకమో, ఆ నియతిచేతనే చెట్లు పెరుగుటకు బొగ్గుపులుసుగాలి- అనగా మనకు పనికిరాక ఊపిరితిత్తులనుండి విడుచుగాలి—అంత ఆవశ్యకముగా నున్నది.

మనుష్యుని పోషణకు ముఖ్యముగా కావలసిన మాంసకృత్తులు ప్రొటీన్సు తయారగుటలో గూడ కొంతవరకు సహకార సూత్రము తోడ్పడుచున్నది. గాలియందలి నత్రజనిని ఉపయోగించుకొను కొన్ని రకముల బాక్టీరియా—అనగా అతి సూక్ష్మతమమగు క్రిములు—పిల్లిపెసర, వేరుసెనగ మొదలగు చేలవ్రేళ్ళలోని గడ్డలందు ఇమిడియుండి, తాము ఆశ్రయించు చేలలో ఎక్కువ నత్రజని సంబంధమగు మాంసకృత్తులను కల్పించుచున్నవి. ఈచెట్లను నమలుటచే మనుష్యునికిని, జంతువులకును భోజనమగపడుచున్నటి- కోడిగ్రుడ్లను, కోళ్ళను, గొఱ్ఱెలను, వలసినచో గొడ్లను కోసికొని స్వార్థపరత్వమును జూపుచున్నాడు మనుష్యుడు- పొదుగు కోసుకొనియైనను పాలుత్రావ సంశయింపడు- కొంతవరకు చేలగడ్డికై యాసపడుచున్నను తనదేహమును మనుష్యునకును, ఎముకలను భూమికిని, అర్పించి జంతువులు తమ జన్మములను సార్థకముజేసికొనుచున్నవి-

చెట్లసంగతియు, చేలసంగతియు చెప్పనక్కరలేదు- భూమి సరిగా లేక గింజ మొలవనేరదు, నీరు లేక అభివృద్ధికానేరదు, సూర్యకిరణప్రసారము చాలక పచ్చదనముపోసి

వన్నెదారగును- భూసారము చాలక బాగుగ పెరగలేదు- పెరుగుచున్నపుడు ఏగాడిదలైనను, పశువులైనను మేసివేసినచోగాని, మనుష్యునిచేతనే కోసివేయబడినప్పుడుగాని క్రిందవ్రేళ్లున్నంతకాలము, భూమాత ఆశ్రయమున్నంతకాలము, ఎటులనో నాలుగు ప్రాణములు పోయినను అయిదవ ప్రాణముతో జీవనము సాగించుకొని, క్రొత్త చిగుళ్లతో మొలకలెత్తగలదు... మొలకలెత్తిన నెవరికి ఆ ఉపకారము తనకుతప్ప మిగిలిన అందరికిని గదా ? తాను వచ్చినది ఒక గింజనుంచియే; తాను పెట్టిన పిల్లలు దుబ్బులో 4, 5 ఇంకా ఎక్కువగనే యుండవచ్చును—మనుష్య కల్పితమైన అనుకూల పరిస్థితులయందు- ఒక్కొక్క పిల్ల తిరిగి ఒకటినుండి 4 వెన్నులైనను వేయవచ్చును- వెన్నులోనున్న గింజ లన్నిటిని లెక్కించిన మనుష్యు లెందరున్నారో పాఠకులకు తెలియదు. ఇదంతయు స్వార్థత్యాగమునందు ప్రథమ శిక్షణ యనుకొన దగదా ?...

ఇక భూమాతకు ఆహారము, నిద్ర కూడ అక్కరలేదు- జడ పదార్థమని మనము భావింపడగదు,- భూమిని, దానియందు ఎన్నెన్ని రసాయనిక, భౌతిక మార్పుల కాలవాల మగుచున్నదో, మనకు ఇంకను పూర్తిగా తెలియలేదు- మనము అనగా మనలో ఏధీమంతుడగు సోదరునికిని గూడ తెలియదనుట, శాస్త్రజ్ఞులకును అభేద్యములగు క్లిష్ట సమస్యలున్నవనుట- పశ్వాదుల కనుపయోగమగు గడ్డిగాదలను, మలమూత్రములను తన ఉపరిభాగమున కుళ్ళబెట్టుకొనుచు చిన్నచిన్న క్రిములకును సూక్ష్మక్రిముల మూలముగా చెట్లకును, తద్వారా జంతువులకును అందు నగ్రగణ్యుడగు మనుష్యునికి ఆహారమును ప్రసాదించు "భూమి" ఋణము, తీర్చుకొనగలమా ?

---

# స్వప్నకేళి

తూర్పుకొండలమధ్య చంద్రోదయంబు
చేత కర్కశ శిలలును చెమ్మగిల్లె,
క్రూరమౌ నాదుమానస కుహరమందు
ప్రణయినీ రూపముదయించి పసనుజేసె.

రజనీకాంత, తనూవిలాస గరిమన్ రాణింపగానొయ్యనన్
గజయానంబునవచ్చుచుండ, మొదలే, కౌటిల్యనీలాలక
వ్రజసంఛన్నముఖారవిందమున జీర్ణంబైన బొట్టోయనన్
సుజనాహ్లాదకరుండు చంద్రుడుదయించున్ కృష్ణమేఘంబులన్

నవనవ యవ్వనంబున న నర్గళమౌ సుఖకేళి దేలియున్,
అవయవశక్తికోర్కె లడుగంటిన పిమ్మట సర్వసంగమందు విముఖుడై, విభూతిమెయి తోరముగాధరియించు యోగివృంగవువలె, తూర్పులోయలో మృగాంకుడు దోచు నమానరాత్రులన్

మలయసమీరపుత్రులు, సుమాళుల మేనులగంధమూని, కౌగిళుల నొసంగి సాగిరసఖున్ గిలిగింతలువెట్టి, సంభ్రమాకులిత మనస్కయౌ మనను గూడిచలించెడి ముద్దరాలికిన్
వలపు చిగిర్చవచ్చిరి, సువర్ణమయూఖుని ప్రాపుపెంపునన్

"శీతల క్షీరధారలను చిక్కగజిల్కెను చందమామ, జీమూతగుణంబుదాల్చి" యని ముచ్చటగా తనయాననంబు ముంజేతిపై జేర్చిపల్క, "సతి' చేకురె నీకు కవిత్వ, మైన నే వ్రాతును నీవుపాడ" మని వ్రాలితి స్వప్నములోని తల్పమున్.

—బూర్గుల రంగనాధరావు.

(సాధనసమితి.)

## ఆంధ్రరమణీమణులు భా-౧

ఇందు—కాకతీయాంధ్రసామ్రాజ్య సింహాసన మధిరోహించి జనరంజకముగ, శత్రుభయంకరముగ రాజ్యమేలిన రుద్రమ్మ; ధరణికోట సింగపుపీఠి నెక్కి అసామాన్యముగ రాజ్యచక్రము త్రిప్పిన గణపమ్మ; ఆంధ్రదేశమున ఆడుదియై పుట్టిన మంత్రిరాక్షసుని అపరావతారముగా నాయకురాలను బిరుదుగాంచి పలనాటి నాగమ్మ. కౌగిలిలోనున్న భర్తను దీవించి కరవాలమొసగి కదనరంగమునకంపిన మాంచాల; ప్రజారంజకముగ పెద్దాపుర సంస్థానమును పాలించి తురక ఫౌజుదారుని బారి పడకుండ జోహారొనర్చిన అభిమానస్వరూప రాగమ్మ; ఆమె చేతులనుండి ఆమె మనుమని ఏడు మాసముల కసుగందుని గ్రహించి పంచకరపాట్లుపడి అరసి రక్షించిన స్వామిభక్తిపరాయణ మహాలక్ష్మమ్మ; పతియగు రాయజగపతితో సహగమన మొనర్చుచు పతి విరోధియగు ఆనందరాజునకు తిరుగని శాపమిచ్చిన మహాపతివ్రతాతిలకమగు సీతమ్మ; రాణివాసపు స్త్రీలందఱకంటె ముందుగాఁ దాను కత్తికెరయైన మానమెఱిగిన స్త్రీత్వమునకు మొదలిపేరైన బొబ్బిలిరాణి మల్లమ్మ; నిండు చూలాలయ్యు మానసంరక్షణార్థమై నిజప్రాణముల ఖడ్గమున కెరచేసిన రమణమ్మ— వీరలఅద్భుతచరితలు ఆంధ్రాభిమానముతో ప్రస్తరింపబడినవి.

2-వ కూర్పు. 112 పుటలు. దళసరి కాగితములు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

## ఆంధ్రరమణీమణులు భా-౨

ఇందు—రణరంగమున వీరవిహారము విరమించి యింటికి వచ్చిన పతికి వీరసందేశమిచ్చి తిరిగి కదనభూమికి పంపి అతనికి వీరస్వర్గమిప్పించిన ఆంధ్ర వీరపత్ని చానమ్మ- మానముకొఱకు, మాటవాసికొఱకు తన్నుతాను పొడుచుకొని చనిపోయిన తంజావూరి తెనుగురాణి రాజగోపాలమ్మ- యీ రాజగోపాలమ్మ మనుమని చెంగమలదాసుని విక్రాంతి సమయమున అరసి రక్షించి తన ప్రభుభక్తిని ప్రకటించిన దాది - మధుర ఆంధ్రనాయక రాజ్యపాలనమును మహనీయముగ సాగించి దాననిరతిని, ఆంధ్రభాషాభిమానమును అతిశయముగ ప్రదర్శించిన మంగమ్మ- చాందాసాహేబు మోసమునకు గుఱియైన మీనాక్షి- పథ్యముముట్టని పచ్చి బాలెంతరాలయ్యు తన సహగమనోద్యోగము నెఱవేరకపోగా పన్నీరుత్రాగి ప్రాణములు విడిచిన పతిప్రాణ ముత్తమ్మ ప్రజోపయోగమునకై శిశుసహితముగ బలిపోయిన సంగమ్మ వీరల పవిత్రచరిత్రలుగలవు.

దళసరి కాగితములు. 100 పుటలు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

## కేయూరబాహుచరిత్ర

శిల్పము మెఱయ మంచనమహాకవి రచియించిన కేయూరబాహుచరిత్ర అను పద్యకావ్యమును ఆధారముగ తీసికొని తేట తెనుగు వచనమున జనసామాన్యముకొఱకు వ్రాయబడినది. పెండ్లాడినవానిని సార్వభౌమునిగా జేయు వరమునొందిన మృగాంకావళియను నొకరాజకన్యను కేయూరబాహువను రాజునకు నతని ధర్మపత్నిచే భాగురాయణుడను నాతని మంత్రి నిజబుద్ధిబలమున వివాహముచేయించిన వృత్తాంతమిందలి ప్రధానకథ. నడుమ నడుమ చక్కని నీతికథలు పెక్కులు గలవు.

గ్లేజు కాగితములు. 90 పుటలు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

## ఆంధ్రరాజభక్తులు

రాజభక్తి యనుదిన దేశభక్తికి పర్యాయపదముగా రాణించుచుండిన ఆంధ్రదేశపు స్వతంత్రయుగ చరిత్రలలో రాణించు రాజభక్త శిఖామణులగు విశ్వనాథనాయడు, యాచమనాయడు, అబ్దుర్ రజాక్ లారీ, కరిబసవస్వామి, తిక్కన మంత్రి, మహాలక్ష్మమ్మ, పాపారాయడు, హనుమప్ప నాయడు అను ఎనమండుగురి చరిత్రలను కీర్తించు గ్రంథము.

గ్లేజు కాగితములు. 112 పుటలు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

ఆంధ్రభూమి బుక్కుడిపో, వేపేరి, మదరాసు.

## పల్లెపదాలు

[౨౪౪-వ పేజీ తరువాయి.]

అప్ప విశిరినపిండి చెల్లుటయె లేదూ
అప్ప దంచినబియ్యాం చెల్లుటయె లేదూ
అప్పుడే మననారీ అప్పవచ్చినదీ
ఆరోజు బోనిచ్చీ ఆమరూనాడూ
విశినిగిరి సాలెన్నా సంతకెళ్ళేడూ
ఓయిఓయ్ సాలెన్నా ఓయిసాలెన్నా
మాఅత్త మామల్లూ బాగనున్నారా
మీఅత్త మామల్లూ బాగుగున్నారూ
మాతోడికోడల్లూ బాగవున్నారా
మీతోడికోడల్లూ బాగుగున్నారూ
మాబావమరుదులూ బాగవున్నారా
మీబావమరుదులూ బాగుగున్నారూ
మాఆడబొట్టెల్లూ బాగవున్నారా
మీఅడబొట్టెల్లూ బాగుగున్నారూ
మీనాయుడచ్చన్నా జబ్బుగున్నాడూ
సాలిముగానున్నాదీచచ్చిపోతాడూ
కాటికీకఱ్ఱల్లూ తోలుతున్నారూ
ఏటికీ నీళ్ళకీ పంపుచున్నారూ
అమ్మరోమాఅమ్మా మముగన్నతల్లీ
మీఅల్లుడచ్చన్నా సాలింగున్నాడే
సాలిముగ వున్నాడే చచ్చిపోతాడే
కాటికీకఱ్ఱల్లూ తోలుతున్నారే
ఏటికీ నీళ్ళాకీ బోవుచున్నారే
అప్పుడేమన్నాదీ అమ్మదానెమ్మ
అంతగా, నీప్రేమూదియ్యకుంటేనూ
పదుంగోశి కొన్నానూ పట్టుపుట్టములూ
పక్కగాలీనప్పూ డేయవేతల్లీ
వెయ్యోశి కొన్నానూ వెండిపుట్టములూ
అంతగా, నీప్రేమూదియ్యకుంటేనూ
వెన్నగాలీనప్పూ డేయవేతల్లీ [లూ
నూరేశికొన్నానూ నూలుపుట్టములు
నుసురుగాలీనప్పూ డేయవేతల్లీ
పాతికేవున్నాయీ పాలకావిళ్లూ
పక్కగాలీనపుడూ పోయవే తల్లీ
నూరువేవున్నాయీ నూనెకావిళ్లూ
నుసురుగాలీనపుడూ పోయవే తల్లీ
వెయివేలువున్నాయీ నేతికావిళ్లూ
వెన్నగాలీనపుడూ వేయవే తల్లీ
పరిగెట్టి నారెమ్మ పాలొయ్యబోతే
యిటునుంచి ముఖమల్లూ అటుదిప్పుకూనే
నూనెకావిళ్ళన్నీ పట్టుకున్నాదీ
నేతికావిళ్ళన్నీ పట్టుకున్నాదీ
పాలకావళ్ళన్నీ పట్టుకున్నాదీ
పట్టుపుట్టములన్నీ పట్టుకున్నాదీ
నూలుపుట్టములన్నీ పట్టుకున్నాదీ
వెండిపుట్టములన్నీ పట్టుకున్నాదీ
నురుగుగాలీనపుడూ నూనెబోశిందీ
పక్క గాలీనపుడూ పాలుబోశిందీ
వెన్నగాలీనపుడూ వెన్నబోశిందీ
పసుప్రకుంకుమ బొట్లూ పెట్టుకున్నాదీ
దేవతలకందరకీ దణ్ణమన్నాదీ
చుట్టాలకందరికీ మ్రొక్కులన్నాదీ
భర్త ప్రక్కను జేరీ భగ్గుమన్నాదీ

## మహావాక్యరత్నాలు

భావం అనేది గాలి, విజ్ఞానం అనేది తెరచాప, మానవజాతి నావ.

—*Hore*

... ... ...

కొద్ది కష్టపాటు ఒక చిన్న క్వినైన్ మాత్రవంటిది. అది మింగడానికి అంత రుచిగా వుండదు, కాని దానివల్ల మంచి గుణం కలుగుతుంది.

—*Harold Bindloss*

... ... ...

మనల్ని ప్రేమించేవారు కొందరు వున్నారనే జ్ఞానంవల్ల మనబాధ చాలా వరకు తగ్గుతుంది.

—*Addison*

... ... ...

మనం మన సోదరుల్ని వారి అక్కరలను పట్టి కాక వారి అవసరాల్ని పట్టి ప్రేమించాలి.

—*R. Whitwell*

... ... ...

మానవుడికి కావలసింది ప్రతిభ కాదు, దీక్ష కావాలి. ఏదైనా పొందడానికి అధికారం కాదు కావలసింది శ్రమ పడడానికి ఇచ్ఛ కావాలి.

—*Leytton*

... ... ...

ఇతరుల కష్టాలలో మనం ఒక విధమైన ఆనందాన్ని పొందుతామనే సంగతి నేను కనుగొన్నాను.

—*Burke*

# జ్యేష్ఠమాసపు రెండు పర్వాలు

## ౧

## వటపూర్ణిమ

వివాహితలైన స్త్రీలు జ్యేష్ఠశుద్ధ పూర్ణిమనాడు ఈ పర్వాన్ని జరుపుతారు.

### మహారాష్ట్రంలో

ఈరోజున ఉపవాసంవుంటారు. వటవృక్షపూజకు (Ficus Indica) ఉద్దిష్టమైనది. ఈపర్వం స్త్రీలకు వైధవ్యం రాకుండా చేస్తుందని నమ్మకం.

ఈ వ్రతము అనాదికాలంనుంచీ వున్నట్లు కనిపిస్తుంది. ధర్మరాజు ఒకసారి లోమశమహర్షిని ప్రశ్నించాడు. పూర్వం ద్రౌపదివంటి మృదుభాషిణి, సుందరాంగి, పతివ్రత ఐన స్త్రీ వున్నదా అని. అప్పుడు ఆ ఋషి ధర్ముడికి సావిత్రికథ చెబుతాడు.

యముడు ఇచ్చిన నాలుగోవరంలో సావిత్రి జన్మసావిత్రిఅనీ, సౌభాగ్యవతి అనీ, మంగళమహేశ్వరి అనీ తానుపిలవబడాలని కోరింది. ఆవరంపొంది సావిత్రి తిరిగివచ్చి తన భర్తగడ్డం ముట్టుకుంది. అతడు లేచి కూర్చున్నాడు.

### మాళవదేశంలో

మాళవదేశంలో ఈపండగ జ్యేష్ఠశుక్లత్రయోదశి మొదలు పూర్ణిమవరకు మూడు రోజులు చేస్తారు.

ఈ మూడురోజులు స్త్రీలు వటవృక్షానికి; సావిత్రి, సత్యవంతుడు, యముడు వీరల పటానికి పూజచేస్తారు. వివాహితలై సుమంగలులుగావున్న స్త్రీలు మాత్రమే ఈ వ్రతాన్ని ఆచరిస్తారు.

కొందరు స్త్రీలు ఈపర్వాన్ని ఒక్క పూర్ణిమనాడుమాత్రమే ఆచరిస్తారు. ఆనాడు వారు పూర్తిగా ఉపవాసం వుంటారు. మరునాడు ఉదయాన్ని భోజనం చేస్తారు.

మూడురోజులు ఈపర్వాన్ని జరిపించేవారు త్రయోదశి ఉదయం మొదలు పౌర్ణమినాటి సాయంకాలంవరకు ఉపవసిస్తారు.

పూర్తిగా నిరాహారంగా వుడలేనివారు నీళ్లు, పాలు, తేనీరు, పళ్లు, సగ్గుబియ్యము, పంచదార పుచ్చుకోవచ్చును.

కుంకుమతోకలిపిన బియ్యం (అక్షతలు), పసుపు, కర్పూరం, పువ్వులు, అగరువత్తులు, దారము, ఒకకర్రకు చుట్టిన కొన్ని వత్తులు, ఆకులు, పోకలు, చిల్లరడబ్బులు—ఇవి పూజకు ముఖ్యంగా కావలసినవి.

పూర్ణిమనాటి ఉదయాన్ని స్త్రీలు వటవృక్షానికి పూజచేస్తారు. ఆ చెట్టు కాండానికి మూడుసారులు దారం చుడతారు అప్పుడు పూజచేసి నైవేద్యంపెడతారు. ఆమీద స్త్రీలు బియ్యముకాని, గోధుములుకాని ఒకరికి ఒకరు వాయనం ఇచ్చుకుంటారు. ఆవాయనంలో మామిడిపళ్లుకూడా వుంచుతారు.

పూర్ణిమనాటి మధ్యాహ్నం పురోహితుడువచ్చి సావిత్రికథ చెబుతాడు. పురోహితుడు చెబితేతప్ప స్త్రీలు చెప్పుకుంటే ఈకథకు ఫలంలేదని మాళవదేశస్థుల నమ్మిక.

### కథ :

మనదేశంలో వాడుకలోవున్న సావిత్రికథకున్నూ, మాళవదేశంలో వాడుకలోవున్న సావిత్రికథకున్నూ కొద్ది భేదాలువున్నాయి. భేదాలు వున్నస్థలాలు పేర్కొంటాను.

సావిత్రికి పదహారుఏళ్లు నిండగా అనురూపవరుణ్ణి వెతుక్కొడానికి యాత్రకు వెళ్ళింది. దారిలో ఒకరాజకుమారుణ్ణి కలుసుకుంది. ఆరాజకుమారుని తండ్రి రాజ్యాన్ని పోగొట్టుకుని వనవాసం చేస్తున్నాడు. ఐనా ఆరాజకుమారుణ్ణి చూడ్డంతోటే సావిత్రికి అతనియందు ప్రేమ కలిగింది.

అందుచేత ఆమె తనతండ్రివద్దకు తిరిగివచ్చి తాను ప్రేమించిన వరుడి సంగతి చెప్పింది. రాజు దర్యాప్తుచేశాడు. పదభ్రష్టుడైన రాజుకొడుకు అనీ, తిరిగి అతడు రాజ్యంపొందే అవకాశాలు లేవనీ తెలుసుకున్నాడు. కాగా తన కూతుర్ని ఆరాజకుమారుడికి ఈయడానికి అతనికి ఇష్టంలేకపోయింది.

ఐనా, సావిత్రి తనపట్టు విడవలేదు. చేసేదిలేక రాజు ఆమెను ఆరాజకుమారునికి ఇచ్చి వివాహంచేయడానికి నిశ్చయిస్తాడు.

ఆమీద అక్కడికి నారదుడువస్తాడు. వచ్చి ఆరాజకుమారుని అల్పాయుస్సుని గురించి చెబుతాడు. ఐనా ఆమె తన సంకల్పాన్ని వీడలేదు. అప్పుడు నార

డుడు ఆమె భర్తమరణసమయంలో చేయవలసిన వ్రతాన్ని గురించి ఉపదేశం చేసి వెళ్ళిపోతాడు.

యథాకాలంలో వివాహం జరిగిపోయింది. సావిత్రి అత్తవారింటికి వెళ్ళింది. నారదుడు చెప్పిన దినం వచ్చింది. ఆనాడు సావిత్రి తనభర్తతోకూడా అడవికివెళ్ళింది. సావిత్రిభర్త వటవృక్షాన్ని ఎక్కి ఎండుకొమ్మ కొట్టబోయాడు. ఇంతలో ఆ కొమ్మవిరిగి అతడు కిందపడి మరణించాడు.

తరవాత యముడురాక. యముడు రెండు వరాలిచ్చి మూడోవరం కోరుకోమంటాడు. సావిత్రి తనకు ఎనముండు గురు కొడుకుల్ని ఇమ్మని అడుగుతుంది. అడావుడిలో యముడు ఇచ్చానంటాడు. ముందుకు పోతాడు. సావిత్రి అప్పుడు తనకు భర్తలేకుండా పిల్లలు ఎల్లా పుడతారంటుంది. ఇక చేసేదిలేక యముడు ఆమె భర్త ఆత్మను ఆమెకు ఇచ్చి వేస్తాడు.

విమర్శ :

సావిత్రి పతిభక్తి నిరుపమానమైంది. పతిభక్తేకాదు ఆమె తెలివితేటలు, ధైర్యసాహసాలుకూడా నిరుపమాన మైనవే.

మూడురోజుల ఉపవాసం- గింజలూ, పళ్ళూ వాయనం ఇవ్వడమూ ఇవి సావిత్రి పతిమరణకాలంలో చేసిన వ్రత చిహ్నాలు కావచ్చు.

కన్యలకు స్వయంగా వరుల్ని సంపాదించుకునే హక్కుగల కాలంనాటికి చెందిన కథ ఇది.

ఆత్మకూడా కనిపించే వస్తువే అనే నమ్మకం ఈ కథలో ద్యోతకమౌతూ వుంది.

వటవృక్షంయొక్క మూలంలో బ్రహ్మ - మధ్యలో జనార్దనుడు - చివరను శివుడు వుంటారనీ, ఆవృక్షంయొక్క సమగ్రస్వరూపం సావిత్రి అని పెద్దలు అంటారు.

ఇతరవిశేషాలు

నియమితరీతి ఒక సంవత్సరం ఏకభుక్తం. జ్యేష్ఠశుద్ధ త్రయోదశి మొదలు జేష్ఠ శుక్లపాడ్యమివరకు వటపూజ. నాలుగోరోజున చంద్రుడికి అర్ఘ్యప్రదానం. సావిత్రికి గంధపుష్పాదులతో పూజ. అనంతరం పూజ. ఏకభుక్త నియమం పెట్టుకు నేవారికి ప్రతిదినం వటవృక్షపూజానియమం. నాలుగురోజులుమాత్రం పూజచేసేవారు పాడ్యమినాడు బ్రాహ్మణులకు దానంచేయాలి.

ఇతరచోట్ల

ఈవ్రతం రాజస్థానంలో సామాన్య ప్రచారంకలది. మహారాష్ట్ర దేశంలో కొంతకలదు. దక్షిణాన స్మార్తుల్లో మాత్రమేకలదు. బ్రాహ్మణులేకాక శూద్రులుకూడా ఈవ్రతం చేయడంకద్దు. వంగదేశంలో ఈనాడు స్త్రీలు వటవృక్ష, సావిత్రి పూజలుచేయక భర్తృపూజ చేస్తారు. భర్తలకు తలంటిపోసి కొత్త బట్ట కట్టిస్తారు. భర్తపూజ వినతరవాత యమపూజ చేస్తారు. వ్రతానికి పేరు మాత్రం వటసావిత్రే. చివరిని వట వృక్ష శాఖలకు పూజ. పల్లెటూళ్ళలోమాత్రం పూజ వటవృక్షాల కింద సాగుతుంది.

ఇది కౌటుంబిక వ్రతం

## ౨ గంగాదశహర

జ్యేష్ఠశుద్ధ దశమి ఈవ్రతవిధానం స్కాంధపురాణంలో కలదు. జ్యేష్ఠశుక్ల దశమి కొందరికి సంవత్సరాది. స్నానము, దానము ముఖ్యము.

జ్యేష్ఠశుక్లదశమి బుధవారం హస్తా నక్షత్రం కలిసివచ్చిననాడు ఈవ్రతాన్ని ఆచరిస్తే సర్వపాపాలు హరిస్తాయి.

---

## కథలపుస్తకాలు

జ్యేష్ఠశుక్ల దశమి బుధవారం హస్తా నక్షత్ర కాలంలో గంగావతరణం ఆయెను. ఇట్లని వాల్మీకిరామాయణం చెబుతూవుంది. ఇది దశమహాపాపాల్ని హరించేది కాబట్టి ఇది దశహార ఐంది.

జ్యేష్ఠశుక్ల పాడ్యమి మొదలు దశమి వరకు స్నానం చేయడంకూడా ఈవ్రత విధానంలోదే.

గంగాదశహరపర్వం నదీతీర గ్రామాల్లోనే విస్తరించి జరుగుతుంది. కాశీ, హరిద్వారం, నాశిక, మధుర, ప్రయాగ మొదలయిన నగరాల్లో ఈపండుగ బాగా ఆచరిస్తారు. ఈప్రదేశాల్లో అక్కడక్కడ గంగాదేవి ఆలయాలు వున్నాయి. అక్కడ గంగపూజ జరుగుతుంది.

జ్యేష్ఠ శుక్లపక్షపాడ్యమి మొదలు దశమివరకు ప్రతిరోజున స్త్రీలు పిండివంటలు చేస్తారు. ఒక్కొక్కనాడు పదేసి భక్ష్యాలు దక్షిణయుక్తంగా బ్రాహ్మలకి ఇస్తారు. పదకొండోనాడు ఉండగలవారు ఉపవాసంవుంటారు. ఆఉపవాసంలో పచ్చి మంచినీళ్లుకూడా తాగకూడదు. గంగాదేవి కృపను సంపాదించడం ఈ పర్వపు ప్రధానోద్దేశం.

కథ :

ఈపర్వసంబంధమైన కథ ఆంధ్రులు అతి ఆప్యాయంగా తెలుసుకోతగింది. ఏమంటే యీకథలో ప్రధానపాత్ర వీనమిగిలిన ఆంధ్ర మహాపురుషులలో ఒకడు. అతడు గోదావరి మండలాంతర్గతమైన ముంగండ అగ్రహారంలోపుట్టి ప్రసిద్ధుడైన జగన్నాథ పండితరాయలు. అతడు యీపర్వ సందర్భంలో ఉత్తర హిందూదేశంలో పూజలు కొంటూ వుండడం ఆంధ్రులు గర్వింపదగినది.

అక్బరు కాలంలో జగన్నాథ పండితరాయలు అనే సంస్కృతకవి ఒకడువుండెను. అతడు బ్రాహ్మణుడైనా మహమ్మదీయ స్త్రీని వివాహమైనాడు. కాగా అతను సంఘ బహిష్కృతుడైనాడు. అందుమీద అతడు తనయొక్క, తన భార్యయొక్క పావిత్ర్యాన్ని నిరూపించుకోడానికిగాను కాశీవెళ్ళారు. వెళ్ళి పండితులతో వాదించాడు. కాని అతడు తిరిగి పవిత్రుడు కాడని పండితులు తిరస్కరించారు.

అప్పుడు పండితరాయలు మీరుచేయకపోయినా గంగాభవానియే తన్ను పవిత్రవంతుణ్ణి చేస్తుందని చెప్పాడు. అక్కడ రేవులో ఏభైరెండు చీడీలు వున్నాయి. పండిత రాయలు ఎత్తైన యాభైరెండో చీడీమీద కూచున్నాడు. గంగను స్తోత్రంచేస్తూ యాభైరెండుశ్లోకాలు చెప్పాడు. ఒక్కొక్కశ్లోకం చెప్పి ముగించేసరికి గంగ ఒక్కొక్క మెట్టు పైకివచ్చేది. చివరిశ్లోకంతో గంగ యాభైరెండుమెట్లు పొంగి పండిత రాయల్ని తనలోనికి తీసుకుంది. అంతటితో అతని పావిత్ర్యం నిరూపితమైంది.

పండితరాయలు తెలుగువాడు. గంగను స్తోత్రంచేస్తూ అతను చెప్పిన శ్లోకాలు నేటికన్నీ బహుళ ప్రచారంలో వున్నాయి. ఈపర్వం అతని మూలకంగా ఏర్పడింది. ఉత్తర హిందూస్థానంలో ఈ పండుగ ప్రచారంలోవుంది. నదుల్ని పూజించే ఆర్యుల ఆచారాన్నిపట్టి ఆదిలో ఈపర్వం ఏర్పడినా ప్రస్తుతం ఇది పండిత రాయల చరిత్రతో జతపడుతూ వుంది. ఈరూపేణా ఆంధ్రుడు ఒకడు ఉత్తరహిందూస్థానంలో పూజలు కొంటూవుండడం ఆంధ్రులకు ఆమోదకర విషయం.

# మీకు తెలుసునా?

## పక్షికి ముగం మెరుగు

ఆఫ్రికాలో బూడిదరంగు చిలకలు వున్నాయి. ఆపక్షి మొగానికి పవుడరు ఉపయోగిస్తుంది. దానిగుండెకిందకొన్ని చిన్న ఈకలు వున్నాయి. ఆ ఈక చివర్లు పగిలి ఒకవిధమైన పవుడర్ను విరజిమ్ముతాయి. దానిని ఆపక్షి ఫేస్‌పవుడరుగా ఉపయోగిస్తుంది.

... ... ...

## అమెరికాలో చెరుకు

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో చెరుకు మొదటిసారి 1751 లో న్యూఆర్లీన్సుదగ్గర పైరుచేయబడింది.

... ... ...

## వ్రాతవిన్నపము

ఇంగ్లండులో హౌస్ ఆఫ్ కామన్సుకు పంపబడే ప్రతి విన్నపమూ చేతివ్రాతలో వుండాలి.

... ... ...

## స్త్రీపురుషులతూకం

పురుషుడు స్త్రీకంటె సగటున ఇరవై పౌనులు ఎక్కువ బరువు వుంటాడని కనుగొనబడింది.

... ... ...

## అక్షరాలసంఖ్య

ప్రపంచంలోని వివిధభాషాలిపుల్లో *కనీసపు అక్షరాలసంఖ్య 12-గరిష్ఠపు అక్షరాల సంఖ్య 202. సాండ్‌విచ్ దీవులవారి భాషాలిపిలో 12 అక్షరాలే వున్నాయి. టార్టారియన్ భాషాలిపిలో 202 అక్షరాలున్నాయి.

# మరికొన్ని ఆకుకూరలు

[ఫిబ్రవరి మాసపు ఆంధ్రభూమి సంచిక ప్రత్యేకం ఆకుకూరల సంచికగ ప్రచురించివున్నాము. అందులో 3] ఆకుకూరల్ని గురించిన వివరాలు వున్నాయి. అందలి విషయాలన్నీ ఒక యాల్. ఐ. మ్. డాక్టరు వ్రాసినవి. అందులో లేని కొన్ని ఆకుకూరల్ని గురించి ఈ వ్యాసకర్త వ్రాసి పంపారు. వానిలో కొన్నిటిని మే సంచికలోనూ, మిగతావి ఈసంచికలోనూ ప్రచురిస్తున్నాము. వీనిని వ్రాసిన శ్రీ వారు వృద్ధులు. ఇందలి విషయాలు వారు అనుభవపూర్వకంగా వ్రాశారని నమ్ముతున్నాము. —సంపాదకుడు.]

1367

రచయిత:

## పురాణం పిచ్చయ్యశాస్త్రి

### చిలకముక్కు కూర

దీనినే చిలకాకు అందురు. సాధారణముగా తోటలలో మొలచుచుండును. మొలకతోటకూరవలెనే వుండునుగాని కాడలును, ఆకులును ఇంచుక యెరుపుగా వుండును. ఇది ముదిరినంతట వుపయోగింపను. లేతగానున్నప్పుడు కోసి, మొలకతోటాకువలెనే తియ్యగను, పుల్లగూరగను వండి తిందురు. విరేచనము చేయును. పుండ్లు, తీట, గజ్జి, నోరు చప్పగావుండుట, గొంతునస- యిట్టి సంకటముల నడచును. తినుటకు రుచిగా నుండును.

### దేవదారు కూర

ఇది అడవి చెట్లజాతిలో చేరినది- కోసి తెచ్చి తరిగి ఆరబెట్టి, పెసరపప్పు జేర్చి పొరటి తిందురు మేహవ్యాధికి మంచిది. మూత్రరోగమును శమింపజేయును శ్లేష్మము నడ్డగించును. ఆరోగ్యకరమైనది.

### గుమ్మడి కూర

బూడిదగుమ్మడి- తియ్యగుమ్మడి యని యిది రెండువిధములు. మొదటిదాని ఆకుకూరను యెవ్వరును వుపయోగింపరు. తియ్యగుమ్మడి తీగలలో కొనలయందలి లేతాకులను కోసి తెచ్చి బాగుచేసి తరిగి తియ్యకూర చేయుదురు. పొరటుకూర చేయుటయుగలదు. దీనిని పొరటునపుడు కొంచెము బియ్యపుతవుడు చల్లి పొరటుదురు. ఇది మెల్లుచేసి నను భుజించుటకు మంచి రుచిగా నుండును. గుమ్మడికాయలు, పండ్లు సర్వవ్యాధులకును విరోధకారులై వుండునుగాని, యీ ఆకుకూర మాత్రము చాల మేలుచేయును. పిత్తమువలన తలతిరుగుట, వోకర వచ్చినట్లుండుట, కడుపులో వికారము, నిద్రలేకుండుట యిట్టి లక్షణములు పోగొట్టును.

### చింతాకు

ఈచింతాకు పేరులుగలవి పలు రకములున్నవి. సాధారణముగా మనకు చింతపండు లభించు చెట్లనుండి లేతచిగురును తెచ్చి పుల్లలు తీసి బాగుచేసి వాడ్చి పూరుబిండి చేయుదురు. అట్లే పచ్చిగానే పొడి గొట్టుదురు. పప్పుచేర్చి పుల్లగూర చేయుదురు. చిగురును యెండించి కొంచెముగా వెచ్చజేసి పొడిగొట్టుదురు. ఇతరమైన ఆకుకూరలతో చేర్చికూడ వండుదురు. చింతపండుగాని చిగురుగాని రోగులకు మంచిదికాదని వైద్యశాస్త్రమున చెప్పబడియున్నది. మంచివారికి సయితము యిది ఆరోగ్యకరము కాదని చెప్పెదరు అయినను దీనిని జను లెక్కుడుగా వుపయోగించెదరు. దీనివలన దుర్గుణము లెక్కుడుగా నుండినను, కొన్ని విషయములలో నిది మహోపకారియగును. ఇది పిత్తమును హరించును. అరుచిని పోగొట్టును. చింతచిగురు కూర పక్వమునెరిగి వండినయెడల మిక్కిలి రుచిగావుండును. ముదురు చిం

తాకును ఇటికరాయిని చేర్చి రోటిలో వేసి దంచి వేయించి గుడ్డలో వేసి కాచినయెడల, కంటిపోట్లు, కండ్లు యెఱ్ఱగానుండి నీరుగారుట, రేజీకటి, మసకలు హరించును.

## మిరపాకుకూర

మనము తినెడి మిరపకాయలు కాచే చెట్లయాకును కోసితెచ్చి పులుసుచేర్చి కూరచేయుదురు. ఈ కూర యించుక చేదుగావుండును. కాని, కాయలవలె ఆకు లనారోగ్యము గలిగింపవు. నోటిపుండ్లు, పెదవులు పగలుట, నాలుక పూత హరించును. ఇది విరేచనకారి-

## మెంతికూర

దీనిని తియ్యగను, పుల్లగను యెట్లు వండి తినినను ఆరోగ్యముగా నుండును. మేహశాంతికరమైనది. మిక్కిలి చలువచేయును. రక్తమూలము గలవారికీకూర మిగుల అనుకూలమైనది. పెసరపప్పు చేర్చి

## కాలాన్ని

ఏదో ఒక ఫలాన్ని ఇవ్వకుండా కాలాన్ని జారిపోనివ్వకూడదు. తెలుసుకోదగిన కొత్తసంగతిని తెలుసుకుంటూనో, పాటింపదగిన కొత్త నియమాన్ని పాటిస్తూనో, నేర్చుకోదగిన కొత్త అలవాటును నేర్చుకుంటూనో కాలాన్ని సద్వినియోగ మొనర్చుకోవాలి.

—*Samuel Smiles*

వండి రక్తమూలముగలవారు యెక్కువగా ఉపయోగింతురు.

## నూగుదోసాకు

ఇది నూగుతోగూడిన ఆకులుగలదై తీగలుపారి అచ్చటచ్చట పొదలమీదను చెట్లమీదను అల్లియుండును. ఈయాకు కూరకు పనికిరాదు. వాడ్చి పచ్చడిచేసి తిందురు, దీనియం దెక్కుడు మంచిగుణములుగలవు. అగ్నిమాంద్యమును బోగొట్టి ఆకలిబుట్టించును. అరుచి బోగొట్టును. మలబద్ధకమును హరించును. పిత్తమువలన గలుగు సంకటములను నివారించును. ఈ యాకు రసముదీసి, కాళ్లుచేతులు వాతముచే వాచినపుడు పూసిన హరించును. కొన్ని మందులలో ఇది ముఖ్యముగా చేర్పబడును.

## దొగ్గలికూర

దొగ్గలాకుతో చింతకాయలు గాని, చింతపండుగాని చేర్చి పుల్లకూరగా వండుదురు. కొందరు పెసరపప్పును చేర్చుటయుగలదు. ఈ కూర భుజించుటకు రుచిగానుండును. మూత్రకృచ్ఛ్రవ్యాధికి యిది చాలా మంచిది.

## నెల్లికూర

నెల్లి అనగా ఉసిరికకాదు. ఇది చెట్టుకూర. ఇందు గద్దనెల్లి, మంచినెల్లి అని రెండురకములుగా వున్నది. మొదటిది యించుక చేదుగావుండును. ఉడికినపు డొకవిధమైన సున్నపువాసన గలిగియుండును. అయినను కొందరు దీని నుపయోగించుట గలదు. మంచినెల్లికి యిటువంటి గుణములేవిన్ని యుండవు. వండినపుడు యింపైన వాసనగలిగి భుజించుటకు రుచిగానుండును. కాని యిది మజ్జిగ పులుసు, పులుసు పచ్చడి చేయుటకు మాత్రమే పనికివచ్చును. మరియొక విధముగా వండుటకుగాని, వాడ్చి పూరుబిండి నూరుటకుగాని పనికిరాదు. ఇది మందకారి. మలబద్ధకము చేయును. కాసవ్యాధిగలవారి కిది మిగుల నుపద్రవము గలిగించును. కడుపులోని నులిపురుగులను నాశము చేయుట కిది మంచిది.

## ముంగరముస్తెకూర

ఈకూర వెలుగులమీదను, కంచెలమీదను తీగలుగా విశేషముగ

## నవ్వు

నవ్వు అంతరంగిక సంతోషానికి బాహ్యచిహ్నము. శారీరక చలనాలన్నిటిలోకి హాసము అత్యుత్తమమైనది. ఏమంటే అది ఒకే సమయంలో శరీరాన్ని, ఆత్మనూ కదులుస్తుంది. నవ్వు జీర్ణశక్తిని పెంపొందిస్తుంది. రక్తప్రసరణానికి తోడుపడుతుంది. బాగా చెమటపట్టిస్తుంది. ఉద్దీపనశక్తిని పెంచుతుంది.

—*Hukeland*

అల్లుకొని వుండును. దీనిపూవులు తెల్లనివి. కాయలు బులాకీవలెనుండును. ఈకూరతో పప్పుచేర్చి తియ్యకూరగావండి తిందురు. ఇది పులుసుకూరకుగాని, పొరటుకూరకుగాని ఉపయోగింపదు. జిగట విరేచనములు, ఓకిరింతలు, గొంతు నసగలవారికీ కూర శమనకారియై వుండును.

## వావింటకూర

మొలకలుగానుండునపుడీకూర మిక్కిలి రుచిగానుండును. తిరిగి వండి చింతాకుపొడిచల్లి పొరటియుపయోగింతురు. వాతరోగులకిది మేలుచేయునుగాని, పైత్యము నధికరింపజేయును. తీరని కపాలపుపోటు గలవారు దీని యాకును నలిపి రసమునుపిండి వేసి పిప్పిని కపాలమున పెట్టి మాటిమాటికి నొత్తుచు పిండుచున్నయెడల తలలోని చెడునీరును తీసివేయును. . పోటు నయమగును. చెవిపోటుగలవారు దీని రసమును రెండుమూడు బొట్లు చెవిలోపిండి వెంటనే వంచివేసిన యెడల చెవినొప్పి తొలంగును.

## అటికమామిడాకు

ఇది బిళ్ళలవలె నేలపైనల్లియుండు కూర. ఇది పులుసుకూరకు మాత్రమే వుపయోగింపబడును. ఎక్కువ రుచికరముగా నుండునది కాకున్నను మూత్రరోగములకును, సుఖసంకటములకును కొంతవరకు ననుకూలముగా వుండును.

## బుడ్డకాకరకూర

తోటలలోను—జొన్న, తవిద, చేలలోను ఈ యాకు కాకరవలెనే తీగలుగా నేలమీదను, కంపలమీదను అల్లుకొనివుండును. ఈయాకును తెచ్చి, నెయ్యిగాని, నూనెగాని, ఆముదముగాని వేసి వాడ్చి ఊరుబిండి చేయుదురు. చింతపండు చేర్చవలెను. ఇది భుజించుటకు మిక్కిలి బాగావుండును. అ రుచి పరిహారమైనది. అధికముగ నాకలి బుట్టించును. మలబద్ధక మడంచును. పిత్తమునడగించును. తాపమును పోగొట్టును. ఆరోగ్యమును కోరువారు యీయాకు పచ్చడి ఉపయోగింపవలయును.

## నాసరజంగికూర

భూమిమై పట్టలు పట్టలుగా ఈకూర మొలచి చిరుతీగలుగా వ్యాపించియుండును. ఇది పులుసుకూరగా చేయుటకే పనికివచ్చును. ప్రత్యేకముగా వండినయెడల ఇది చిలుమువాసనగా వుండును. కావున దీనితో మరియేదైన కూరను చేర్చి వండుదురు. సాధారణముగా ఈ కూరను పేదవారు వండుకొందురు. ఇది విరేచనములు కలిగించును. కఫమును సంకటము చేయును. పిత్తము నధికరింపజేయును. ఎక్కుడు రుచిగానుండు కూరాకులలో చేర్చదగినది కాదు.

## విజ్ఞానవిషయాలు

### మొసలిగుడ్డుధ్వని

మొసలి గుడ్డు పెడుతుంది. ఆగుడ్డు పగిలి పిల్ల బయటికి రాబోయేముందు ఆ గుడ్డులోపలినుండి ఒకవిధమైన కీచుధ్వని బయలుదేరుతుంది. ఆధ్వని కొన్ని గజాలదూరంవరకూ వినిపిస్తుంది.

* * *

### భూచలనం

రెండువేల సంవత్సరాలపూర్వం తిరిగినంత చురుకుగా భూమి ప్రస్తుతం తిరగటంలేదని ఒక శాస్త్రవేత్త కనుగొన్నాడు. 160,00,00,0‾0 ఏళ్ళ అనంతరం భూమి అసలు కదలనే కదలదని అతడు అంటున్నాడు.

* * *

### తుపాకిమందు

తుపాకిమందు యూరప్‌లో ఆంగ్లేయులచేత క్రెసీయుద్ధంలో 1349 లో ఉపయోగింపబడింది.

* * *

### యూరప్‌లో తివాసీలు

తన రాజభవనంలో రత్నకంబళి ఉపయోగించిన ప్రథమ ఆంగ్లరాణి ఎలిజబత్. అయితే యూరప్‌లోని స్పానిష్ బిషప్ ఒకడు 1255 లోనే తివాసీ ఉపయోగించినట్లు నిదర్శనాలు వున్నాయి.

* * *

### జీవితపరిమాణం

ప్రపంచంలో వెయ్యిమందిలో ఒక్కడుమాత్రమే నూరేళ్లు జీవిస్తున్నాడు. ప్రతినూరు మందికి ఆరుగురుమాత్రమే 65 ఏళ్ళవరకు జీవిస్తున్నారు. ఏడువందలమందికి ఒక్కడుమాత్రమే ఎనభై ఏళ్ళవరకు జీవిస్తున్నాడు.

# బతకతగనిది!

[చిన్న కథ.]

'అమ్మా! నిజమే గాని, డాక్టరుకూడా మనిషే. వాడు జంతువు గాని, యంత్రం గానికాదు. చూస్తూ ఒక యిల్లాలు మాతృత్వం చంపుకుంటోందంటే...'

రచయిత·

గుంటూరు సత్యనారాయణ, ఎం. ఏ.

'విన్నారా? అదీ ఆమె కంప్లైంటు...నాకూ ఇష్టంలేదు సుమండీ, చెప్పొద్దూ! ..ఇంకా మా పెళ్ళయి వన్ ఇయరేనా కాలేదు, అప్పుడే పిల్లలేమిటండీ!' అన్నాడు రామారావు. అతడికి ముప్ఫైఅయిదేళ్లుంటాయి. అప్పాళ్ళో మ్యునిసిపల్ కమిషనరుగా పనిచేస్తున్నాడు. భార్యకు ఇరవై ఐదుంటాయి- స్కూలు హెడ్ మిస్ట్రెసుగా ఉంది. పాశ్చాత్యవిధానానుకరణంలో ఆఊరి కా దంపతులదే మొదటి బహుమతి.

డాక్టర్ మోహనరావు నవ్వుతూ: 'మీలాంటి చదువుకున్నవాళ్ళే ఇలాంటినీచపు సలహాలకు వస్తే...'

రామారావు మొహం చిట్లిస్తూ: 'మీరు పొరబడుతున్నారు బర్త్ కంట్రోల్ ఎంత ప్రాముఖ్యం పొందుతోంది ఈరోజుల్లో ...'

'ఇది బర్త్ కంట్రోల్ కాదు, హత్య! ఆసిద్ధాంతంమీద నమ్మకం వున్నవాళ్లు పెళ్ళెందుకు చేసుకోవాలీ? ఉత్తమ బ్రహ్మచర్యం అవలంబించరాదూ? దాంపత్యసుఖం కోరేవాళ్లు, ఈ పన్లెందుకు చెయ్యాలీ?'

ఇంతలో కారులో మిసెస్ రామారావు దిగింది. రామారావామెనిచూసి నవ్వుతూ 'డియర్! డాక్టరుగారు పొట్టి పూర్వాచారి సుమా! పిచ్చి నమ్మకాలు చాలా ఉన్నాయి! నీ కేసు తీసుకునేలా కనుపించడం లేదు.'

ఉగ్రురాలై పోయింది: 'ఏం? పాపం, పుణ్యం అని లెక్చరు కొడుతున్నారేమిటి? ...డాక్టర్...మీ దగ్గరకు వేదాంతంకోసం వొచ్చేంవా, సలహాకొచ్చేంగాని?'

'అమ్మా, నిజంవేగాని, డాక్టరు కూడా మనిషే. వాడు జంతువు గాని, యంత్రంగానికాదు. చూస్తూ ఒకయిల్లాలు మాతృత్వం చంపుకుంటోందంటే...'

'ఓ! నాన్సెన్స్! డాక్టర్, ఇలాంటి పెద్దపెద్ద మాటలకవిలువలేదిప్పుడు! మాతృత్వంఏమిటి నా మొహం, ఈమూడో నెలకే ఇలా చస్తూంటే...'

మోహన్ మరి మాటాడలేదు. కొంతసేపు నిశ్శబ్దంగా ఊరుకొని, చిరునవ్వుతో 'ఆల్ రైట్, మిసెస్, రావ్! మిమ్మల్ని ట్రీట్ చెయ్యడానికి నాకేం అభ్యంతరం లేదు. చాలా సులువైనపనే, మూణ్ణెల్ల పిండాన్ని చంపడం. కాని మీరు చాలా నీరసించి పోతారు!' 'మరేం ఫరవాలేదు!!'–'ఓ. కే.'

* * *

'డాక్టర్! ఆమె బతుకుతుందా?' అన్నాడు రామారావు, నెలరోజుల తరువాతి ముచ్చట.

'ఏమో చెప్పలేను. చాలా ప్రమాదకరమైనస్థితిలో ఉంది. నా చేతనైనంతవరకు ప్రయత్నిస్తాను!'

* * *

ఆమె చచ్చిపోయిన తరువాత ......మోహన్ అన్నాడు: 'మిస్టర్ రామారావ్! మీరు మళ్ళీ వివాహం తలపెట్టకండి. ఆమె అసలు చచ్చిపోవలసింది కాదు, అంతకన్న ముఖ్యమైంది, ఆమె బతకతగనిది! అంచేత నేనే చంపేశాను!!...ఏం? అలాచూస్తారు... కోపంవొస్తోందా? .. మీ ప్రేమబంధం తెంపీసేను కాదూ? ...అహ్హహ్హా!...ప్రేమ!...పిల్లల్ని ప్రేమించలేనివాళ్ళకు ... మాతృత్వమాధుర్యం తెలియనివాళ్ళకూ ప్రేమ అంటే అర్థమెలా తెలుస్తుందండీ?...ఆవిడ బతికిఉంటే ..ఇంకా...ఎన్ని జీవపిండాలు నశించిపోయి ఉండునో?...అలా చూడకండి...నన్నేమీ చెయ్యలేరుమీరు ...నేను డాక్టర్ని...పేరుపడ్డ డాక్టర్ని...'

# నిడమర్తి జలదుర్గాప్రసాదరాయడుగారు

రచయిత:

## ఏకుమళ్ల కామేశ్వరరావు, బి.ఏ., బి.ఇడి.

నిడమర్తి జలదుర్గాప్రసాదరాయడుగారు 1862 లో జన్మించారు. వీరి పూర్వుల నివాసస్థలం భీమవరం తాలూకాలోని కొమ్మర. వీరు దేశపాండ్యా కుటుంబం, నియోగి బ్రాహ్మలు. నిడమర్తి వారిది భారద్వాజసగోత్రం, ఆపస్తంభసూత్రం. జలదుర్గాప్రసాదరాయడుగారి తండ్రిపేరు వెంకటనరసింహంగారు, తాతపేరు రామన్నగారు. వీరితల్లి పేరు సత్తెమ్మగారు, తల్లియొక్క తండ్రిపేరు కొవ్వలి శరభయ్యగారు జలదుర్గాప్రసాదరాయడుగారిని సాధారణంగా దుర్గయ్యగారు అని అంటూంటారు.

దుర్గయ్యగారి తండ్రిగారు రాజమహేంద్రవరం వచ్చేటప్పటికి దుర్గయ్యగారికి అయిదేళ్ళ వయస్సు దుర్గయ్యగారు ఒకటోతరగతి దగ్గర నుంచి బి. ఏ. వరకూ రాజమహేంద్రవరంలోనే చదివారు వీరు చిన్నక్లాసులు చదివేటప్పుడు ప్రభుత్వ కళాశాల లేదు. ఇప్పుడు ప్రభుత్వకళాశాల ఉన్న కట్టడంలోనే మునుపు జిల్లా ఉన్నతపాఠశాల ఉండేది. ఆ జిల్లా పాఠశాలే క్రమేపీ కళాశాలగా మార్చబడింది ఈ ఉన్నత పాఠశాలలోనే దుర్గయ్యగారు తరగతులన్నీ చదివి కళాశాలలో ఎఫ్.ఏ. బి.ఏలు చదివారు.

వీరికి తెలుగులో అభిరుచి పుట్టడానికి 'కారణం కొంత, వీరితండ్రిగారు భారత భాగవతాది పురాణాలు చదవడం. మరొక కారణమేమిటంటే, ఈయన చిన్నతరగతులు చదివేటప్పుడు తెలుగులో తక్కువ మార్కులు వస్తూండేవి. అలాగ తక్కువమార్కులు రాగా ఒకమారు వీరి ఉపాధ్యాయులైన వావిలాల వాసుదేవశాస్త్రిగారు "మీతండ్రిగారు భారత భాగవతాలు చదువుతూంటారు కదా నీకు తెలుగులో శ్రద్ధలేదేం" అని అడిగారు. దుర్గయ్యగారికి తెలుగులో మంచి మార్కులు తెచ్చుకోవాలని ఉద్దేశం కలిగింది. వడ్డాది సుబ్బారాయుడుగారిదగ్గర తెలుగు చెప్పించుకోడం మొదలుపెట్టారు. తెలుగులో అభిరుచి కలగడానికి ఇదొక కారణం దుర్గయ్యగారు బి.ఏ. పరీక్ష 1884 లో ప్యాసయ్యారు. వీరు అసలు ఈపరీక్ష 1882 లోనే ప్యాసవవలసింది కాని వీరి తండ్రిగారు 1882 లో ఏర్పైనాలుగోయేట స్వర్గస్థులయ్యారు తండ్రిగారి మరణంవల్ల అప్పుడు చదవడానికి కుదరక 1884 లో బి.ఏ. పరీక్ష ప్యాసయ్యారు. బి.ఏ. ప్యాసయ్యేక బోధనాభ్యాసన పరీక్షకూడా పై 1 వేటుగా ప్యాసయ్యారు. వీరు 1882 తర్వాత కొన్నాళ్ళపాటున్నూ, 1884 తర్వాత కొన్నాళ్లున్నూ రాజమండ్రీ టవున్ స్కూలులోనూ, ప్రభుత్వ కళాశాలలోనూ, అమలాపురం హైస్కూలులోనూ, రాజమహేంద్రవరంలోని యు.ఎల్.సి. మిషన్ ఉన్నత పాఠశాలలోనూ ఉపాధ్యాయులుగా పనిచేశారు. వీరు 1888 లో ఫస్టుగ్రేడ్ ప్యాసయి ప్లీడరీలో ప్రవేశించారు.

దుర్గయ్యగారికి పదిహేనోఏట వివాహమయింది వివాహానికి వారి తల్లి రాలేదు. తమకు తగిన మర్యాదలు జరగడం కష్టమని ఆమె రాలేదు దుర్గయ్యగారి భార్యపేరు సత్తెమ్మగారు. ఆమె తండ్రిపేరు జీడిగుంట గురురాజుగారు. సత్తెమ్మగారు 1896 లో దివంగతులయ్యారు. ఆమెయొక్క సంతానం ఇప్పటికి ఉన్నవారు అయిదుగురు కొడుకులూ, ముగ్గురు కూతుళ్ళూ. దుర్గయ్యగారు తిరిగి 1899 లో వివా

హం చేసుకున్నారు ఆమె పేరు సుబ్బమ్మగారు. ఆమెతండ్రిగారు బెండపూడి రామరాజుగారు. ఆమెయొక్క సంతానం ఇప్పటికి ఉన్నవారు ఒక కొడుకూ, ఇద్దరు కూతుళ్ళూ. దుర్గయ్యగారి తల్లిగారు 1926 లో స్వర్గస్థులైనారు.

దుర్గయ్యగారు 1892 లో రాజమహేంద్రవరం మునిసిపల్ సంఘ సభ్యులు అయినారు. ఆయేడే చైర్‌మన్ అయి తొమ్మిది ఏళ్ళవరకూ చైర్‌మన్‌గా ఉన్నారు. దుర్గయ్యగారు గొప్ప ప్రాక్టీసు గల ప్లీడరు. వారు కొన్ని లక్షలు ఆర్జించారు.

దుర్గయ్యగారికి తెలుగులో అభిరుచి ఎలాగ కలిగిందో పైనే చూశాము. వీరు 1882 లో 'హరిశ్చంద్రచరిత్రము' మొదటిభాగం రాశారు. రెండోభాగం అసలు తలపెట్టలేదు. మొదటిభాగం పాఠ్యగ్రంథంగా నిర్ణయించబడింది. ఆ కాలంలోనే వీరు ఏవో పద్యాలు అల్లుతూండేవారు. వీరు 1884 లో కాళిదాసు మేఘసందేశం అనువదించడం మొదలు పెట్టారు. కాని విశేషంగా చెయ్యలేదు. 1918 ప్రాంతాల్లో వడ్డాది సుబ్బారాయుడుగారి ప్రోత్సాహంవల్ల మేఘసందేశం అనువదించి 'శ్రీమదాంధ్ర మేఘసందేశ కావ్యము' అన్న పేరున ప్రకటించారు. వీరు 1919 లో 'ఉత్తరరామచరిత్రము', 1923 లో 'శాకుంతల నాటకము', 1924 లో 'చంపూరామాయణము', 1932 లో 'శ్రీభగవద్గీతాదర్శనము' ప్రకటించారు. ఈ ఆఖరుది తప్ప పై మూడూ అనువాదాలు. శ్రీ దుర్గయ్యగారు ఇంకా మరి కొన్ని గ్రంథాలు రాయదలచుకున్నారు.

---

# అనుభవసూక్తులు

## భార్యలకు సలహా

దేనికైనాసరే నీ భర్త సలహా కోరు. అట్టి సందర్భంలో భర్త నీ సలహానే అనుసరిస్తాడు.

—*Fanny Fern*

* * *

గర్విష్ఠులకు, ఉద్రిక్తుల్ని అధికారం తృప్తిపరుస్తుంది. శాంతిమతుల్ని, భయస్థుల్ని ధనం ఆనందపరుస్తుంది. అందుచేతనే యువకులు అధికారంకోసం, వృద్ధులు డబ్బుకోసం ఆశపడతారు.

—*Dr. Johnson*

* * *

చేతకానితనాన్ని కప్పిపుచ్చేటందుకు కుయుక్తి.

—*Chesterfield*

* * *

దయ అనే ద్వారానికికూడా గడియలు వున్నాయి. ఒకప్పుడు ఆద్వారం మూసివేయబడవచ్చు. న్యాయం అనే తాళంచేత ఆద్వారం బిగింపబడవచ్చు.

—*Dr Rabigh*

* * *

## వర్తనసౌందర్యము

అందమైన ముఖంకంటె అందమైన ఆకారం మంచిది. అందమైన ఆకారం కంటె అందమైన ప్రవర్తన మంచిది. సుందర విగ్రహములకంటెకూ, రమణీయ చిత్రాలకంటెకూ అందమైన ప్రవర్తన హెచ్చు ఆనందాన్ని ఇస్తుంది.

—*Ralph Waldo Emerson*

* * *

## భార్యలు

మంచి భార్యలు మంచి పువ్వులవలె అరుదుగా లభ్యమౌతారు. చెడ్డభార్యలు చెత్తా చెదారముల్లాగ ఎక్కువపడితే అక్కడే వుంటారు.

—*Euripides*

* * *

మతవిషయంలోను, వివాహ విషయంలోను నేను ఎవరికీ ఎట్టిసలహాను యివ్వదలచుకోలేదు. ఇవ్వను. ఏమంటే వారి కష్టసుఖాలకు యిహంలోను పరంలోనుకూడా నేను కారణభూతుడను అనిపించుకోవడం నాకు యిష్టంలేదు.

—చెస్టర్‌ఫీల్డ్.

* * *

దురదృష్టతకు గుంఖించుట అవివేకం. ఆపదలు లేకండా అఘోరించడం మూర్ఖత.

—డాక్టర్ జాన్‌సన్.

* * *

'ఆత్మరక్షణార్థం అహింసాతత్వవాదులు హింసాతత్వ మవలంబించినా తప్పు లేదు.

—గాంధీజీ.

# రాంబందుల జీవితరహస్యం

రాంబందులు భూమికి 200 మైళ్ళ ఎత్తున ఎగురుతూ వుంటాయి.

పల్లెటూళ్ళలో పశుపక్ష్యాదులు చచ్చి పడివుంటే వాటిని భక్షించడానికి రాంబందులు తండోపతండములుగా చేరడం అందరూ చూచే వుంటారు.

200 మైళ్ళ ఎత్తున ఎగిరే ఆ పక్షులు యీ చచ్చిన జంతువులను ఎలా కనిపెడతాయి అన్నది ప్రశ్న.

అంతే కాదు. అన్ని రాంబందులు ఒక్కచోటికి ఎట్లా వస్తాయి అనేది విచిత్ర విషయం.

రాంబందులు అన్ని పక్షుల్లాగా జంటజంటలుగా కాపరం చేయవు. గుంపులు గుంపులుగా నివసిస్తాయి.

ఆ గుంపులు కూడా దగ్గర దగ్గరగా వుండకండా దూరం దూరంగా వుంటాయి.

ఈ పక్షికలాలు యింత దూర దూరంగా నివశిస్తున్నా ఎక్కడేనా ఒక జంతువు చచ్చి పడివుందంటే [illegible] చేర[illegible]యి.

[illegible] బిగు [illegible] ఫోర్ [illegible] అను ప[illegible]శోధకుడు గొప్ప దూరదర్శక యంత్ర సహాయంతో ఈ రాంబందుల గమన విశేషాలను కనిపెట్టాడు.

ఆహారాన్ని వెతకడానికి అవి గుంపులు గుంపులుగా బయలుదేరతాయి అనుకోడం సత్యదూరం. రాంబందులు రెండుమూడుకన్నా కలిసి ఒకే ప్రాంతంలో వెదుకుతూ వుండవు.

ఒకవేళ ఏదేనా ఒక గుంపు వుందంటే అది కేవలం చిన్న పిల్లలకు తరిఫీయదు ఇచ్చేదై వుంటుంది. ఆహారాన్ని వెతుకుతూ వున్న కాలంలో అవి చాలా తాపీగా ఎగురుతూ వుంటాయి. తమ గూండ్లను విడిచి ఆరు మొదలు పది మైళ్ళ దూరం పోగానే ఒకసారి వలయాకారంగా చకర్ కొడతాయి. అట్లా చకర్ కొట్టకుండా ముందుకు ఒక పక్షి అయినా సాగదు. ఆ నియమాన్ని పాటింపకండా వుండవు. ఆ పక్షులకు ఎక్కడేనా ఆహారం కనపడిందంటే ఆ గుంపులోని పక్షి ఒకటి చక్రువ చువ్వంగా ఆ వైపునకు [illegible] అన్ని పక్షులూ క్రిందకు దిగుతాయి.

ఆహారాన్ని వెతకడానికి వెళ్ళే పక్షులు చాల బలమైనవిగా వుంటాయి. వాటి వేగం ఉపద్రవముయింది. ఆహారాన్ని వెతికే పక్షులు ఒకదాని కొకటి కనుపించేటంత దూరంలోనే వుంటాయి. ఎక్కడేనా ఒక రాంబందు ఆహారాన్ని కనిపెట్టిందంటే అది ఆ ప్రాంతంలో వలయాకారంగా తిరుగుతూ వుంటుంది—ఇతర పక్షులు తన్ను చూచేవరకు. అట్లా వలయాకారంగా తిరగడమే వాటికి గుర్తు. కాగా అన్ని పక్షులూ ఆ స్థలానికి చేరుకుంటాయి. వాటిలో స్వలాభాపేక్ష లేనట్టుంది. లేకుంటే ఆహారం కనుపించగానే గప్చిప్గా తినేయక అన్నిటిని ఆ చేరదీయడమేమిటి చెప్పండి.

అంత ఎత్తునుంచి ఆహారాన్ని చూడగల్గుతోందంటే ఎంత సూక్ష్మదృష్టి అయివుండాలి!

అవి సర్వసాధారణంగా ఎనిమిది పది మైళ్ళ ఎత్తునుండి స్పష్టంగా చూడగలవు.

రాంబందులు జటాయువు సంతతిలోనివి. రావణుడు సీతను ఎత్తుకుపోతోవుంటే ఎక్కడను చోకని పెట్టి డీకొని అసువులుగాసింది

జటాయువు [illegible] మెచ్చుకొని [illegible] అర[illegible] దాన్ని [illegible] చేసి [illegible]

మిచ్చాడు. అప్పటినుండి జటాయువు జాతి రాంబందు (గ్రద్దలకు రామబంధువు) లని పేరు.

జటాయువుకి సంపాతి అనే సోదరు డుండేవాడు.

ఆ రెండూ పందాలు వేసుకొని సూర్యమండలం వరకు ఎగిరాయి.

అక్కడ సూర్యుని వేడికి వాటి రెక్కలు కాలి క్రిందపడ్డాయి. తరువాత ఒకరికొకరు కనుపించలేదు.

దశరథుడు కౌసల్యను పెండ్లాడడానికి వెళ్ళి దారిలో సముద్రాన పడి కొట్టుకుపోతూ వుంటే జటాయువు గగనవీధినుండి చూచి కనికరించి రక్షించింది. అప్పటినుంచి వారికి అన్యోన్యత అధికమైంది ఆ స్నేహ బాంధవ్యమే సీతను రక్షించడానికి జటాయువును పురికొల్పింది.

కాని ఏంలాభం — ప్రాణాలు కోల్పోయింది.

రాంబందులు ఉండబట్టే పల్లెటూళ్లు యింకా వాసయోగ్యాలుగా వున్నాయి. లేకుంటే ఊరు నలుపక్కలావున్న బజారు బయళ్ళకు పెంట కుప్పలకు తోడు చచ్చిన జంతు జాలాలు పడివుంటే వేరే చెప్పాలీ ఆ గ్రామసీమల సౌభాగ్యం.

రాంబందులు సర్వసాధారణంగా హాని చేయవు. కాని వాటికి అపరిమితమైన ఆకలినుంట రోగం దంటే సజీవంగావున్న జంతువులను గ్రుడ్లు పీక్కు తింటాయి.

అవి జంతువులను చంపడం చాలా చిత్రంగా వుంటుంది.

మొదట్లో వాటి గ్రుడ్లు పొడిచి వేస్తాయి.

గ్రుడ్లు పోయి మూలుగుతో వున్న జంతువును చెక్కా ముక్కా చేసి మింగేస్తాయి రాంబంధువుల దండు. వాటికి కడుపునిండా తిండి దొరికితే తిన్నచోటనుండి కదలలేవు. కుక్కలూ కాకులూ వాటిని ఎంత పీకినా కదలవు అందుకనే. కాని అవి గట్టిగా పీకితే వాటిని ఎగిరి తన్నుతాయి.

అవి రెక్కలు అప్పళించి పైకి ఎగసినాయంటే వాటిని పట్టుకోగల యంత్రాలుకూడా యింకా నిర్మింపబడలేదని చెప్పవచ్చు.

మానవమాత్రులకు కనుపించకంటా గగనమూర్ధాన ఎగిరిపోతుంది.





Printed at the Andhrabhumi Printing Works. 36 Mukatal Street. Vepery P O, Madras.
Editor & Publisher Andra Seshagiri Rao B.A.